Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 47 • 16-11-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# జగన్ ప్రయాస... కిరణ్‌కు శ్వాస!

తానొకటి తలిస్తే దైవం వేరొకటి తలుస్తాడన్నానుడి వైఎస్ జగన్ విషయంలో తరచూ రుజువౌతున్నది. తనకు బెయిల్ కూడా ఇవ్వని కాంగ్రెస్ సర్కారు గద్దె మీద ఎందుకుండాలనే ఆక్రోశంతో మజ్లిస్‌ను ప్రేరేపించాడు జగన్. దాని ద్వారా కిరణ్ సర్కారును అస్థిరత్వం పాలు చేసి, సోనియాగాంధీకి కూడా తన సత్తా ఏమిటో చూపాలన్నది ప్రయత్నం. అయితే తీరా మజ్లిస్ మద్దతుకు ఉపసంహరణ జరిగిన తర్వాత పరిణామాలు చూస్తే, కిరణ్ పాలిట ఆ మద్దతు ఉపసంహరణే ఒక వరంగా మారుతున్నది.

మజ్లిస్ ఉపసంహరణ ఢిల్లీ కాంగ్రెస్ పెద్దలను కూడా కలవరానికి, ఆశ్చర్యానికి గురి చేశాయి. కేవలం జగన్ ప్రోద్భలంతో ఒవైసీ ఇంత తీవ్ర నిర్ణయం తీసుకోవడాన్ని వారు నమ్మలేక పోతున్నారు. మజ్లిస్ నేతలలో వస్తున్న మార్పులను ముందుగా పసిగట్టి, జాగ్రత్త పడలేకపోవడం కిరణ్‌కుమార్ రెడ్డి అసమర్థత అన్నది నిజమే అయినా, ఈ దశలో ఏ కారణం వల్ల కిరణ్‌కుమార్‌రెడ్డిని మార్చి కొత్త ముఖ్యమంత్రిని రంగంలోకి దించితే, మజ్లిస్ బ్లాక్ మెయిల్‌కు కాంగ్రెస్ పార్టీ లొంగిపోయిందన్న అపవాదు పైన పడుతుందని ఆలోచన చేస్తున్నారు కాంగ్రెస్ పెద్దలు.

నిజానికి కిరణ్‌కుమార్‌రెడ్డిని మార్చి, తెలంగాణకు చెందిన వేరొక నాయకుడిని రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా పంపాలని రెండు వారాల క్రితమే ఒక నిర్ణయానికి వచ్చింది కాంగ్రెస్ అగ్రనాయకత్వం. మర్రి శశిధర్‌రెడ్డి, డి.శ్రీనివాస్‌ల పేర్లపై లోతుగా పరిశీలన కూడా చేశారు. కొద్ది రోజులలోనే కిరణ్ మార్పు తథ్యం అని పరిశీలకులందరూ నిశ్చయానికి వచ్చేశారు.

ఈ దశలో జగన్ తొందరపాటు కిరణ్‌కు వరంగా మారింది. కిరణ్ సర్కారును పతనం చేయడానికి రెండంచెల వ్యూహం అవలంభించాడు జగన్. దానిలో మొదటిది – మజ్లిస్ మద్దతు ఉపసంహరణ. రెండవది – కాంగ్రెస్ నుంచి తెలంగాణకు చెందిన పది మంది ఎమ్మెల్యేలను కూడగట్టి, గవర్నర్ వద్దకు పంపి, తాము పార్టీ వదలి వెళ్తున్నట్లు లేఖలు ఇప్పించడం. మజ్లిస్ వరకు జగన్ మంత్రం బాగానే పారింది. అయితే కాంగ్రెస్ ఎమ్మెల్యేలు మాత్రం జగన్ కోరుకొన్న స్థాయిలో ముందుకు రాలేదు. తాము లేఖలు ఇచ్చినా గవర్నర్ కిరణ్ సర్కారును విశ్వాస పరీక్షకు నిలబెడతాడన్న నమ్మకం లేకపోవడం వల్ల వారు కొంతకాలం వేచి చూడాలన్న ధోరణిలో వున్నారు. గవర్నర్ ఇప్పటికిప్పుడు విశ్వాస పరీక్ష పెట్టి, కిరణ్‌ను దించితే ఫర్వాలేదు. కానీ అది జరగకపోతే మాత్రం – ఉదారంగా ఒకటిన్నర సంవత్సరంపాటు ప్రభుత్వం వల్ల కలిగే ప్రయోజనాలు వదలుకోవలసి వస్తుంది. పనులు, పైసలు నష్టం. పైగా తెలంగాణలో జగన్ ప్రభావం ఎంత అన్నదానిపై ఒక స్పష్టత రాలేదు. కోమటిరెడ్డి రాజగోపాల్‌రెడ్డి వంటి రెడ్డి వర్గం కాంగ్రెస్ నేతలు తప్ప తతిమా కులాలకు చెందినవారు జగన్ పక్షం చేరడానికి ఇష్టపడడం లేదు. మధు యాష్కి, మందా జగన్నాథం, పొన్నం ప్రభాకర్, కె.కేశవరావు వంటి ఎమ్పీలంతా టిఆర్ఎస్ వైపు మొగ్గు చూపుతున్నారు. ఆ రాజకీయ పరిణామాలలో ఒక స్పష్టత వచ్చే వరకు వేచి వుండకుండా తొందరపడి జగన్ పక్కన చేరితే నష్టపోతామన్న భయం తెలంగాణ కాంగ్రెస్ వాదులలో ఏర్పడుతున్నది. అందువల్లనే వారు జగన్ కోరినట్లుగా కిరణ్ మీద తిరుగుబాటుకు సన్నద్ధం కాలేదు. దీనితో జగన్ ప్రయాస, కిరణ్‌కు కొత్త శ్వాస ప్రసాదించింది. జగన్ కొంతకాలం ఓర్పు పట్టి వుంటే కిరణ్‌ను కాంగ్రెస్ పెద్దలే గద్దె దించి వుండేవారు.

# నగదు బదలీ

పేద ప్రజలకు ప్రభుత్వ పథకాల ప్రయోజనాన్ని నేరుగా నగదు రూపంలో అందించబోతున్నది కేంద్ర ప్రభుత్వం. మొదట ప్రయోగాత్మకంగా 50 జిల్లాలలో దీన్ని అమలు చేయబోతున్నారు. అందులో మన రాష్ట్రానికి చెందిన రెండు జిల్లాలు కూడా వున్నాయి. సంక్షేమ పథకాల పేరిట లక్షల కోట్ల రూపాయల ఖర్చు తప్ప, పేదలకు మాత్రం నిజమైన ప్రయోజనం జరగడం లేదన్న వాదన ఎంతోకాలంగా వుంది. ఆ లోపాన్ని సరిదిద్దడానికి సంక్షేమ పథకాలకు ప్రభుత్వం పెట్టే ఖర్చును నేరుగా పేదలకు అందించాలనే ఆలోచన నాలుగేళ్ల క్రితం చంద్రబాబు నాయుడు లేవనెత్తాడు. 2009 ఎన్నికలలో నగదు బదలీ పథకాన్ని ఎన్నికల ప్రచార అస్త్రంగా మలచాడు. కానీ ప్రజలు చంద్రబాబును విశ్వసించలేదు. ఆనాటి ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ఆ పథకాన్ని గేలి చేశాడు కూడా.

అయితే విచిత్రంగా ప్రధాని మన్మోహన్‌సింగ్ ఇప్పుడు చంద్రబాబు చెప్పిన మార్గాన్నే అనుసరించబోతున్నాడు. మన దేశంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు లెక్కలేనన్ని సబ్సిడీ పథకాలు అమలు చేస్తున్నాయి. రేషన్ షాపుల ద్వారా ఆహార పదార్థాలు, రైతులు వాడే ఎరువులు, ప్రజానీకం సమస్తం వినియోగించే పెట్రోల్, డీజిల్, వంట గ్యాస్, పారిశ్రామికంగా పెట్టుబడి, వడ్డీలకు సబ్సిడీ, ఎగుమతులకు ప్రోత్సాహక సబ్సిడీ... ఇట్లా వేలాది పథకాలలో సబ్సిడీ ఇమిడి వుంది. అంతెందుకు – కుటుంబ నియంత్రణ కోసం వాడే నిరోధ్‌లో కూడా కేంద్ర ప్రభుత్వ సబ్సిడీ దాగి వుందంటే, సబ్సిడీల రూపేణా ఎన్ని లక్షల కోట్ల రూపాయల ప్రభుత్వ ధనం ఖర్చు అవుతుందో వూహించుకోవచ్చు. అయితే ఈ సొమ్ముకు తగిన ప్రతిఫలం పేదలకు అందడం లేదన్నది నిజం. ఆహార పదార్థాల సంగతే చూస్తే, సబ్సిడీ మీద ఇవ్వడం కోసం ఎఫ్‌సిఐ ద్వారా వడ్లు, గోధుమలు సేకరించాలి. ఆ సేకరణలో చెప్పలేనంత అవినీతి, గోడౌన్లు లేక వానలకు తడిచిపోవడం, గోడౌన్లలో నిర్వహణ సరిగా లేక ఎలుకలు తిని పారేయడం, రవాణా నష్టాలు వాటి మీద ప్రభుత్వ వ్యయం తడిచి మోపెడౌతున్నది. వంట గ్యాస్, రైతులకిచ్చే ఎరువులు వంటి వాటిలో అసలు వినియోగదారులకు కలిగే ప్రయోజనాల కంటే మధ్యలో దళారీలు తినే మొత్తాలే ఎక్కువవుతున్నాయి. దీనివల్ల సబ్సిడీల మీద ప్రభుత్వ ఖర్చు పెరిగి ఏటికేడాది పెరిగిపోతున్నది. పేదలకు మాత్రం వారికి దక్కవలసిన ప్రయోజనం దక్కడం లేదు. ఈ లోపాన్ని సవరించడానికి వివిధ దేశాలలో జరిపిన ప్రయోగాల ఫలితమే నగదు బదలీ పథకం. అది గ్యాస్ కానీ, ఎరువులు కానీ, ఆహార పదార్థాలు కానీ, మరొక వస్తువు కానీ దాని మీద ప్రభుత్వం ఇవ్వదలచిన సబ్సిడీని నేరుగా వినియోగదారుడికి బ్యాంక్ ఖాతాలో జమ చేయడమే ఈ పథకం లక్ష్యం. అట్లా చేయడం వల్ల ఆయా వస్తువుల సేకరణ, రవాణా, నిల్వ వంటి విషయాలలో ప్రభుత్వానికి నిర్వహణ భారం తగ్గుతుంది. అవినీతికి ఆస్కారం వుండదు. ప్రభుత్వం పెట్టే ఖర్చుకు తగిన ఫలితం వస్తుంది. ఆఫ్రికా ఖండంలోని పలు దేశాలలో గత కొన్నేళ్లుగా అమలులో వుంది. ఆర్థికంగా మనతో సమానమైన బ్రెజిల్‌లో కూడా ప్రవేశపెట్టారు. వాటి ఫలితాలు బాగుండడంతో ఇటీవలనే బరాక్ ఒబామా కూడా అమెరికాలో దీన్ని ప్రవేశ పెట్టాడు. అక్కడి పేదలకు, మరీ ముఖ్యంగా నల్లజాతి ప్రజలకు ఈ పథకం కొత్త జీవితాన్ని ప్రసాదించింది.

జమీన్‌రైతు

భారతదేశంలో కూడా ఇది సత్ఫలితాలిస్తుందనడంలో సందేహం లేదు. అయితే ఈ పథకానికి కొన్ని పరిమితులు, షరతులు విధించడం చాలా అవసరం. కుటుంబ నియంత్రణ, ఆరోగ్య జాగ్రత్తలు, పిల్లల చదువులు వంటి వాటిలో ప్రభుత్వ లక్ష్యాలను అనుగుణంగా మసలుకొనే వారికి మాత్రమే దీన్ని వర్తింపచేయాలి. అంటే ఇంట్లోని చిన్న పిల్లలందరూ బడికి వెళ్తున్నట్లు రుజువులు చూపితేనే సబ్సిడీ నగదు ఇవ్వాలి. దానివల్ల ప్రజలలో క్రమశిక్షణ అలవడుతుంది. మరొకప్రక్క బ్యాంక్ ఖాతాలో నగదును త్రాగుడు వంటి దుర్వ్యసనాలకు దుర్వినియోగం చేసుకోకుండా, నగదు బదులుగా ఆహార కూపన్ల పద్ధతి ప్రవేశపెట్టడం సముచితం. దానివల్ల పేద ప్రజలకు పోషక ఆహారం లభిస్తుంది. వారి ఆరోగ్యం, కుటుంబ జీవితం మెరుగుపడుతాయి.

## జనవాణి

### చంద్రబాబు పాలనను మరువగలమా?

తెలుగుదేశంపార్టీ అధినేత నారా చంద్రబాబు నాయుడు మళ్లీ అధికారంలోకి రావాలనే యావతో పాదయాత్ర చేస్తున్నాడు. ఈ సందర్భంగా ఏర్పాటవుతున్న సభల్లో తాను మళ్లీ అధికారంలోకి వస్తే మంచిపాలనను అందిస్తానంటున్నాడు. గతంలో ఆయన అధికారంలో ఉన్న రోజుల్లో ఇంటి పన్నును విపరీతంగా పెంచిన ఘనుడు. కరెంట్ ఛార్జీలు సైతం బాగా పెంచి నిలదీసిన ప్రజలపై కాల్పులు జరిపించిన పాలకుడు. సర్‌ఛార్జీలు ఈయన హాయాంలో పుట్టి నేడు మహాభారమవుతున్నాయి. ఉద్యోగులకు పింఛను రద్దు చేసిన ప్రబుద్ధుడీయన. జన్మభూమి కార్యక్రమం పసుపు చొక్కాల వాళ్లను కారుల్లో తిరిగేలా చేసింది తప్ప సామాన్యులకు దీనివల్ల ఒనకూడింది ఏమీ లేదు.

*టి.శివయ్య* — ముత్తుకూరు

### సిజేరియన్ కాన్పులు!

ఇటీవల ఆసుపత్రులలో కాన్పు కోసం చేరిన మహిళల్లో 90 శాతం మందికి సిజేరియన్ ఆపరేషన్లు చేస్తున్నారు. ఇలా ఎందుకు జరుగుతుందో అర్థం కావడం లేదు. ఇటీవల వరకు ఏ గైనకాలజిస్ట్ అయినా మామూలు కాన్పులే చేసేవారు. సిజేరియన్లు అరుదుగా జరిగేవి. సిజేరియన్లు ఆడపిల్లల తల్లిదండ్రులను క్రుంగదీస్తున్నాయి. సిజేరియన్లపై ప్రభుత్వం విచారణ జరిపి డాక్టర్లను కట్టడి చేయాల్సి వుంది.

*టి.కోటేశ్వరరావు* — కోవూరు

### అన్యాయం!

ఇటీవల మన రాష్ట్రంలోని కొంతమంది దళిత క్రైస్తవ నాయకులు తమను దళితుల జాబితాలో చేర్చాలని కేంద్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ఈ విజ్ఞప్తి సమంజసం కాదు. రాష్ట్రంలోని అన్ని దళితవాడల్లో ఉండే దళితులు క్రైస్తవ మతం స్వీకరించి ఉన్నారు. వాస్తవానికి వారంతా బిసి–సి కేటగిరిలోనికి వస్తారు. కానీ మెజార్టీ శాతం మంది దళిత హిందువులుగా నమోదై ప్రభుత్వ ప్రయోజనాన్ని ఏళ్ల తరబడి పొందుతున్నారు. ద్విమత గుర్తింపు క్రైస్తవ మత సిద్ధాంతానికి వ్యతిరేకం. ప్రభుత్వ ప్రయోజనాల కోసం హిందువులుగా, చర్చి ప్రయోజనాల కోసం క్రైస్తవులుగా వ్యవహరించే వారి పట్ల ప్రభుత్వం పొరపాటున కూడా సానుభూతితో ప్రవర్తించకూడదు.

*ఆలూరి ఆత్మనందం* — నెల్లూరు

### చిరంజీవి చేయగలడు!

విస్తరించిన కేంద్రమంత్రివర్గంలో రాజ్యసభ సభ్యుడు చిరంజీవి పర్యాటక శాఖా మంత్రిగా స్వతంత్ర్య హోదాలో బాధ్యతలు స్వీకరించడం ఆయన అభిమానులను ఆనందపరచింది. నెల్లూరుతో చిరంజీవికి దగ్గర సంబంధముంది.

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

20-11-1942
పేజీలు : 4 వెల: అణా

### పత్రికల పునర్దర్శనం

సత్యం అంటే ఏమిటో అనే మీమాంస మానవ జాతి ఆరంభం నుండి జరుగుతున్నట్లే ఉన్నది. చివరకు మన వారంతా భూతహితార్థం సత్యం అని వ్యవహారిక నిర్వచనం చేశారు. దానిని బట్టే భారతంలో దేంట్లోనో దేంట్లోనో బొంకవచ్చు – పైపెచ్చు అఘముపొందదోయ్ వెర్రిరాజా అన్నారు. ఇక నేడు భూతహితార్థం ఏంది దాని తాడు. స్వహితమే అని నిర్ణయించారు. గాబట్టే కదూ – తనకు నచ్చని వార్త వేయవద్దని ప్రభుత్వం పత్రికల నోళ్లు కుట్టి వేసింది. ఇదేం స్వాతంత్ర్యం అబ్బే అంటూ కొన్ని పత్రికలు నోరుమూతకు సహించక అసలే దాగుకొన్నవి.

అన్ని జాతీయ పత్రికలు ఇదే పని చేసి ఉంటేనా ఈ పాటికి స్వరాజ్యమే వచ్చి ఉండేది. చదువుకోని ప్రజలకు జ్ఞాన భిక్ష పెట్టవలసిన పత్రికలే ఐక్యత చూపలేకుంటే 40 కోట్ల మూక భారతీయులను ఎందుకో అమెరీ మంత్రి వూరకే ఎగతాళి చేయడం? ప్రతిక్రియగా హార్నిమ్యాన్ చెప్పినట్లు ప్రభుత్వ వార్తలే 'బ్లాక్ ఔట్' చేసి ఉంటే రక్తిగట్టి ఉండేదిగదా కేళి.

మదరాసులో ఆత్మగౌరవం గల పత్రికలు ఆగిపోయినవి. అర్థ గౌరవం గలవి సాగించాయి. లజ్జాహీనంగా వ్యాపార సంస్థ హిందూ, సగర్వంగా దొరల కోట మెయిలు వెలువడుతుంటే ఉండినాయి గానీ నెల్లూరు జర్నలిస్టు సంఘం వారు 18వ తేది సమావేశమై ప్రభుత్వం ప్రీ సెన్సార్ షిపును (ముందుగా అధికారులను చూపి తర్వాత ప్రకటించవలెననుట) రద్దుజేసినందున పత్రికలు తిరుగా ప్రకటించవచ్చునని తీర్మానించిరి.

–రంధ్రాన్వేషి

## 50 ఏళ్ల క్రితం ఈవారం

16-11-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

**సరిహద్దు సమరం :**

### నెల్లూరు వార్తలు

**'నా సానుభూతి చైనా మీదే'**

13 మంది బుచ్చి హైస్కూల్ విద్యార్థుల సంతకాలతో మాకీ క్రింది వార్త చేరింది.

“దేశ రక్షణనిధి సేకరణకు మేము దామరమడుగుకు పోయి, ఆ పంచాయితీ అధ్యక్షుడు, కరకు కమ్యూనిస్టు అయిన జక్కా వెంకటరెడ్డి గారిని విరాళం అడిగినాము. ఆయన మమ్ములను కూర్చొనబెట్టి దురాక్రమణ చేసింది భారతదేశమే కానీ చైనా కాదని; మెక్‌మోహన్‌రేఖ మన సరిహద్దు అనడం పొరపాటని; ఈ సందర్భంలో చైనా వారిదే న్యాయమైన వాదన అని చెప్పి, దానికి నిదర్శనంగా 'విశాలాంధ్ర' పత్రికలు కొన్ని చూపించి, 41 మీటర్లలో రేడియోలో వచ్చే పెకింగ్ ప్రచారాన్ని వినమని సలహా యిచ్చారు. మిమ్ము ఈ పెడదారి పెట్టింది ప్రభుత్వమే గానీ, మీరు నిజంగా చైనా దురాక్రమణ జరిపిందని నమ్మి వచ్చారా? చైనా దురాక్రమణ చేసిందంటే నమ్ముతారా? అని ఆయన ప్రశ్నించారు. మీరు భారతదేశం మొదట దురాక్రమణ చేసిందని ఒప్పుకొంటే చందా యిస్తాను, లేకుంటే ఒక దమ్మిడీ గూడా యివ్వను, నా సానుభూతి అంతా చైనామీదనే అని మమ్ములను మందలించి పంపాడు.

ఈ పంచాయితీ అధ్యక్షుని వలెనే అభిప్రాయపడుతూ చైనాకు అనుకూలంగా ప్రచారం చేస్తున్న కామ్రేడులు అనేక మంది ఉన్నారనేది గమనించడం అవసరం.

# నెల్లూరు ముచ్చట్లు

## విశ్లేషకుడు

### రొట్టెల పండుగ!

హిందూ – ముస్లింల మధ్య మత సమైక్యతకు ప్రతీకగా నిలిచే రొట్టెల పండుగ ఈ నెల 25, 26, 27, 28 తేదీల్లో బారాషహీద్ దర్గా ప్రాంగణంలో జరగ బోతోంది. వాస్తవానికి మొహరం పండుగ ముగిసిన రెండో రోజు అంటే 27వ తేది రొట్టెల పండుగ జరుపుకో వాలి. ప్రతి ఏడాది భక్తుల సంఖ్య పెచ్చు పెరిగి పోతుండడంతో ఈ యేడు నాలుగు రోజులపాటు రొట్టెల పండుగ జరుగ నుంది. దర్గా దగ్గర శాశ్వతంగా అభివృద్ధి పనులు చేపట్టను రాష్ట్ర ప్రభుత్వం పది కోట్ల రూపాయలు మంజూరు చేసింది. కానీ ఈ యేడాది ఈ పనులేవీ చేపట్ట లేదు. తాత్కాలిక ఏర్పాట్లతో పండుగ చేయను కార్పొరేషన్ అధికారులు సమా యత్తమవుతున్నారు.

### చిరంజీవి రాక?

బారాషహీద్ దర్గా వద్ద జరిగే రొట్టెల పండుగకు కేంద్ర పర్యాటక శాఖా మంత్రి చిరంజీవిని తీసుకొచ్చేం దుకు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి ప్రయత్నిస్తున్నట్లు తెలిసింది. గత ఏడాది జరిగిన రొట్టెల పండుగకు ఆయన హాజరయ్యారు. దర్గా సందర్శన వల్ల ఆయనకు జరిగిన మేలును విపరించి తీసుకరావాలని ప్రయత్నిస్తున్నారు. చిరంజీవి రాక వల్ల దర్గా అభివృద్ధికి ఇంకాస్త నిధులు విడుదలయ్యే అవకాశం ఉంది.

### దోమల స్వైరవిహారం

ఈ సీజన్‌లో వర్షం పడకపో యినా నగరంలో దోమలు స్వైరవిహారం చేస్తున్నాయి. నగరపాలక సంస్థలో అధి కారుల పాలన నడుస్తుంది. ఫాగింగ్ కోసం నాలుగైదు ఆటోలు తిరిగితే సరి పోదు. నగరంలో ఎప్పటికప్పుడు చెత్త ఎత్తించడంతోపాటు డ్రైనేజీలు రోజూ శు భ్రపరిచేలా చూడాలి. నీళ్ల నిలబడి ఉండే ప్రతి ప్రాంతంలో ఆయిల్ బాల్స్ వేస్తేగానీ దోమల సంహార యాత్ర మొద లవ్వదు.

### చలి మొదలయ్యింది!

వాతావరణంలో ఆకస్మిక మార్పులు అనుభవించే వారిని ఆశ్చర్య పరుస్తు న్నాయి. 10వ తేది నుంచి నెల్లూరు నగ రంలో రాత్రి వేళల్లో కాస్త చలి వేస్తుంది. పగటి పూట ఎండ యధాతథంగా ఉం టుంది. ఈ పరిస్థితుల్లో వర్షం కురవా లంటే మరో తుఫాన్ రావాల్సిందే.

### పోస్టల్ శాఖ పనిచేస్తుందా?

పోస్టల్ శాఖ పనితీరు నానాటికి తీసికట్టు నాగంభట్లులా తయారవు తుంది. 'జమీన్‌రైతు' పత్రికకు రాజ మండ్రి నుంచి ఒక పాఠకుడు ఆగస్టులో వ్రాసిన ఉత్తరం నవంబర్ 12వ తేది చేరింది. ఎల్ఐసి వారు బిజినెస్ పోస్టు ఖాతాలో కొంత మొత్తం చెల్లించి నెల్లూరు పెద్ద పోస్టాఫీసులో అక్టోబర్ 23వ తేది పోస్టు చేసిన ప్రీమియం నోటీసు అక్క డకు ఫర్లాంగు దూరంలేని 'జమీన్‌రైతు' ఆఫీసుకు రాను 20 రోజులు పట్టింది. నగరంలో ఉత్తరాల బట్వాడా అబంద రగా ఉంది. పై స్థాయి నుంచి క్రింది స్థాయి వరకు పోస్టల్ శాఖ భ్రష్టుపట్టి పోవడం వల్ల ఆ శాఖ ప్రజాభిమానం కోల్పోతుంది.

### పేలిన టపాకాయల ధరలు

అన్ని వస్తువుల ధరలతోపాటు దీపావళి పండుగ సందర్భంగా టపా సుల ధరలు ఆకాశాన్నంటాయి. ప్రముఖ కంపెనీల టపాసులతోపాటు చిన్నా చితకా కంపెనీలు తయారుచేసే టపా సుల ధరలు పేలాయి. అందరూ ఎక్కు వగా కాల్చే చిచ్చుబుడ్డి, కాకరొత్తులు మొదలుకొని భారీ శబ్దం వచ్చే పేలుడు టపాసుల ధరలు విపరీతంగా పెరిగి పోవడంతో కొనుగోలుదారులు జేబులు తవుడు కోవాల్సిన పరిస్థితి ఎదుర య్యింది. గత ఏడాది ఈ సీజన్‌లో భారీ వర్షాలు కురవడంతో వ్యాపారులు తీవ్రంగా నష్టపోయారు. ఆ నష్టాన్ని పూడ్చుకోవడానికే అన్నట్లు అమాంతం ధరలు పెంచేశారు.

### కిలో బియ్యం 40 రూపాయలు!

బియ్యం ధరలకు మళ్లీ రెక్కలొ చ్చాయి. కుంటిసాకులు చెబుతూ బియ్యం వ్యాపారస్తులు బియ్యం ధరలను బాగా పెంచేశారు. జిలకర మసూరి రకం బియ్యం కిలో 40 రూపాయలుగా, 25 కిలోల బస్తా 900 రూపాయలుగా అమ్ము తున్నారు. ఇంత వెచ్చిస్తున్నా ఈ బియ్యం నాణ్యంగా లేవు. మార్కెట్‌లో విపరీతంగా బియ్యం రేట్లు పెరిగినా జిల్లా అధికార యంత్రాంగం వాటిపై దృష్టి కేంద్రీకరిం చడం లేదు.



### ముస్లిం సమాజంలో తస్లీం హత్యపై చర్చ!

నెల్లూరు చేపల మార్కెట్ దగ్గర పిండిమిల్లు నిర్వహించే జిలానీ భాయ్ మంచి వ్యక్తని అందరూ చెబు తారు. ఈయనకు ఇద్దరు భార్యలు. ఆరుగురు పిల్లలు. జిలానీ బాషా ఇటీ వల మరణించారు. ఆయన మరణించే ముందు ఆస్తులు ఇద్దరు భార్యలు, వారి పిల్లలకు సమంగా పంచి పెట్టారు. కానీ పెద్ద భార్య మైమూన్, ఆమె పిల్లలు ఆరిఫ్, ఆసిఫ్, జావెద్‌లకు చిన్నమ్మ అమీ నాబీ అంటే పడదు. ఆమెను, ముగ్గురు పిల్లలను అంతమొందిస్తే ఆస్తి మొత్తం సొంతమవుతుందని పథక రచన చేశారు. దీనిలో భాగంగా బుజబుజ నెల్లూరులో తన ఇంటి వద్ద ఆడుకొం టుండిన అమీనాబీ కుమారుడు తస్లీంను కిడ్నాప్‌చేసిన మొదటి భార్య కుమారుడు జావేద్ ఆ బాలుడ్ని కొత్తూరు దగ్గర నిర్జన ప్రదేశంలో చంపి పాతిపెట్టేశాడు. అమీనాబీ తన సవతి, వారి పిల్లలపై అనుమానం వ్యక్తం చేయడం పోలీసు దర్యాప్తులో ఇది నిజమని తేలడంతో జావేద్‌ను అరెస్ట్ చేశారు. దీని తర్వాత మొదటి భార్య మైమూన్ ఇంటిపై దాడి జరిగింది. ఈ కుటుంబంలో అందర్నీ అరెస్ట్ చేయాలని అమీనాబీ ఐదవ పట్టణ పోలీస్ స్టేషన్ వద్ద పోలీసులను నిలదీసింది.

నగరంలోని జెండావీధి ప్రాం తంలో పలువురు నేతలు, ముఖ్యులు రెండేసి పెళ్లిళ్లు చేసుకొని ఉన్నారు. పలువురికి ఆస్తుల గొడవలున్నా హత్యల వరకు పోలేదు. 12 ఏళ్ల బాలుడు తస్లీం హత్యపై వన్‌టౌన్ ప్రాంతమంతా పెద్ద చర్చ జరుగుతుంది. ఇస్లాంలో హత్యకు హత్యే పరిష్కారం. లేదంటే క్షమాభిక్ష పెట్టాలి. అది తస్లీం హత్య విషయంలో సాధ్యపడేట్లు లేదు. మొత్తానికి ఆస్తి వ్యవ హారం ఎలా ఉన్నా ఈ కేసు వల్ల ఐదు గురు జీవితాలు తలక్రిందులై పోయాయి.




నెల్లూరు ఏసి స్టేడియం వాకర్స్ అసోసియేషన్ నిర్వహించిన అవగాహన సదస్సులో గ్లకోమా వ్యాధి గూర్చి వివరిస్తున్న కంటి వైద్యుడు ఎవిఎస్.కృష్ణప్రసాద్. వేదికపై రాఘవేంద్రశెట్టి, బలరామయ్యనాయుడు, రమేష్.

### రత్నం కిడ్స్ కార్నివాల్

నెల్లూరు సరస్వతినగర్‌లోని డాక్టర్ కిషోర్ జెన్‌నెక్స్ట్ స్కూల్‌లో చదివే విద్యా ర్థినీ విద్యార్థుల నేతృత్వంలో 10వ తేది అనిల్ గార్డెన్స్‌లో కార్నివాల్‌ను వేడుకగా నిర్వహించారు. దీనిలో భాగంగా స్కూల్ పిల్లలు 36 అంశాలకు సంబంధించి ప్రత్యేక ప్రదర్శనలు ఏర్పాటు చేశారు. బర్త్‌డే సెలబ్రేషన్స్, హిందూ దేవాల యాలు, బీచ్, ఫుడ్ కోర్టు, ప్రపంచ ఎని మిది వింతలు, ఫ్లవర్ ల్యాండ్, మార్కెట్ తదితర ప్రదర్శనలు ఆకర్షణీయంగా ఉండినాయి. ఈ కార్యక్రమంలో జిల్లా విద్యాశాఖాధికారి రామలింగం, స్కూళ్ల అధినేతలు డాక్టర్ కృష్ణ కిషోర్, వాసంతి పాల్గొన్నారు. ఈ సందర్భంగా డాక్టర్ కృష్ణ కిషోర్ విద్యానగర్‌లోని ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ కాలేజీలో చదువుతూ తెల్ల కామెర్ల వ్యాధితో బాధపడుతున్న విద్యార్థి ఎస్తేర్ ప్రీతికి సహాయం చేయమని 50వేల రూపాయల విరాళాన్ని డిఇఓ చేతికి అందించారు.

### మోగని ఢమరుకం

నాగార్జున హీరోగా నటించిన ఢమ రుకం సినిమా విడుదల రెండు శుక్ర వారాలుగా వాయిదా పడుతుంది. అభి మానులు ఈ సినిమా విడుదల కోసం నిరీక్షించడమే కాదు శివుని చల్లని చూపుల కోసం నాగ్ యువసేన అధ్య క్షుడు మధు మూలపేటలోని మూలస్థానే శ్వర స్వామి దేవస్థానంలో 11వ తేది రుద్రాభిషేకం, రుద్రహోమం చేశాడు.

కొరవ 14వ పేజీలో

## నారాయణను ఆదర్శంగా తీసుకోండి!

• వైద్య విద్యార్థులకు మంత్రి కొండ్రు మురళి సూచన



దంతవైద్య విద్యార్థులకు డిగ్రీలు ప్రదానం చేస్తున్న మంత్రి కొండ్రు మురళి.

నారాయణ విద్యాసంస్థలలో చదివే విద్యార్థులు తమ కళాశాల అధినేత నారాయణను ఆదర్శంగా తీసుకొని ఉన్నత శిఖరాలు అధిరోహించాలని రాష్ట్ర వైద్య విద్య, ఆరోగ్యశ్రీ శాఖామంత్రి కొండ్రు మురళి సలహా యిచ్చారు. నారాయణ డెంటల్ కాలేజిలో దంత వైద్య విద్యను పూర్తిచేసిన విద్యార్థులకు ఆయన పట్టాలు ప్రదానం చేసి మాట్లాడారు. రాష్ట్రంలోని ప్రతి జిల్లాకు ప్రభుత్వ మెడికల్ కళాశాల ఏర్పాటు ధ్యేయంగా కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం పనిచేస్తుంది. దీనిలో భాగంగానే నెల్లూరు మెడికల్ కాలేజి ఏర్పాటుకు 368 కోట్ల రూపాయలను మంజూరు చేసిందన్నారు. నిజామాబాద్‌లో కూడా త్వరలో ప్రభుత్వ మెడికల్ కాలేజి పనులు ప్రారంభమవుతాయన్నారు. ఆరోగ్యశ్రీ పథకంలో ప్రభుత్వ ఉద్యోగులను చేర్చే యోచన చేస్తున్నట్లు చెప్పారు. రాష్ట్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం వైద్య విద్యకు అధికంగా నిధులు విడుదల చేస్తుందన్నారు. ఈ కార్యక్రమంలో నారాయణ విద్యాసంస్థల అధినేత డాక్టర్ పొంగూరు నారాయణ, డైరక్టర్ సుబ్రహ్మణ్యం, కో ఆర్డినేటర్ విజయకుమార్, కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ రామకృష్ణ, దంత వైద్య కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ మహేష్, డాక్టర్ కృష్ణారావు, సతీష్ రెడ్డి, కరుణాకర్ రెడ్డి, పట్టాభిరామిరెడ్డి, విజయ భాస్కర్‌రెడ్డి, భాస్కర్ రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## ప్రెస్ క్లబ్ నిర్వహణపై ఆరోపణల వెల్లువ!

• జర్నలిస్టుల నేతలు మారాలి

నెల్లూరు మహబూబ్‌ఖాన్ పార్కులో ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్టుల సంఘం నేతృత్వంలో నడిచే ప్రెస్‌క్లబ్ నిర్వహణపై ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. యూనియన్ పాత కార్యవర్గం రకరకాలుగా నిధులు దండి దానితో జర్నలిస్టుల సంక్షేమం కోసం కొన్ని కార్యక్రమాలు నిర్వహించి కొంతమేర దుర్వినియోగం చేసిందని ఈ నాటికీ చెబుతున్నారు. పాత కార్యవర్గం తలలో దూరిపోయే విధంగా ఇప్పటి అధ్యక్షుడు వ్యవరిస్తున్నాడని కార్యవర్గ సభ్యులే విమర్శిస్తున్నారు. ఈయన బాధ్యతలు స్వీకరించినప్పటి నుంచి ప్రెస్‌క్లబ్ లెక్కాపక్కా చెప్పడం లేదని, ఇక్కడ ప్రెస్‌మీట్లు నిర్వహించను వసూలు చేసే మొత్తాలను తన జేబులోనే వేసుకొంటున్నాడని కార్యవర్గ సభ్యులే వ్యాఖ్యానిస్తున్నారు. యూనియన్ అధ్యక్షుని హోదాలో ఎపిటూరిజం హోటల్‌లో బసచేసి ఉండే ఈయన రకరకాల వ్యక్తిగత పరిష్కారాల్లో తల దూరుస్తున్నాడన్న దుమారం రేగి ఉంది. యూనియన్ ప్రధాన కార్యదర్శి ఈయనను కలవను వెళ్లి గంటల తరబడి హరిత హోటల్‌లో వేచి ఉండాల్సి వస్తుందట. ప్రెస్‌క్లబ్‌కు అధ్యక్షుడు ఎప్పుడోగానీ రాకపోవడం వల్ల జర్నలిస్టులకు నిత్యం ఎదురయ్యే సమస్యలకు పరిష్కారం దొరకక ఎలక్ట్రానిక్ మీడియా కొత్త సంఘం పెట్టుకొన్నట్లు పోబిడి. కొత్త అధ్యక్షుని ఎన్నిక తర్వాత జరిగిన రెండు కార్యక్రమాలు శ్రీనివాస కళ్యాణం, జర్నలిస్టులకు క్రీడల నిర్వహణ కూడా కార్యదర్శి బలవంతం మీద చేసినట్లు జర్నలిస్టులు బహిరంగంగా వ్యాఖ్యానిస్తున్నారు. యూనియన్ కోశాధికారి సైతం అధ్యక్షుని వ్యవహారశైలిపై విసిగిపోయి ఉన్నా ఆయనకు క్షేత్రస్థాయిలో బలంలేక గమ్మున కూర్చున్నట్లు తెలిసింది. జర్నలిస్టుల సంక్షేమం కోసం మునిసిపల్ స్థలంలో కట్టించిన ప్రెస్‌క్లబ్ వ్యక్తుల వ్యక్తిగత అవసరాలు తీర్చేస్థాయి కేంద్రంగా మారడంపై జిల్లాలోని జర్నలిస్టులు తీవ్ర ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

## నెల్లూరులో రోటరీ గవర్నర్!

### పలు సేవా కార్యక్రమాలకు శ్రీకారం

రోటరీ డిస్ట్రిక్ గవర్నర్ ఎంవిఎస్ ప్రభు 8వ తేది నెల్లూరు రోటరీ క్లబ్‌ను సందర్శించారు. క్లబ్ నేతృత్వంలో మూలపేటలోని ఏనుగు సుందరరామిరెడ్డి, నవాబుపేటలోని బివిఎస్ గర్ల్స్ హైస్కూళ్లలో 100 స్కూల్ బెంచీలు పంపిణీ చేశారు. దర్గామిట్టలోని క్షయాసుపత్రినిలోని రోగులకు దుప్పట్లు పంపిణీ చేశారు. వీటిని రొటేరియన్ సాధు నరసింహారావు సమకూర్చారు. బోడిగాడితోటలో రోటరీ క్లబ్ నిర్వహిస్తున్న స్మశాన వాటి




బివిఎస్ గర్ల్స్ హైస్కూల్‌లో రోటరీ గవర్నర్ ప్రభు.

కను గవర్నర్ సందర్శించి నిర్వహణ వివరాలు తెలుసుకొని రోటరీ సేవలను కొనియాడారు. సాయంత్రం ఆర్టీసి బస్టాండ్ వద్దగల రోటరీ ఆడిటోరియంలో జరిగిన బహిరంగ సభలో గవర్నర్ ప్రభు మాట్లాడుతూ రోటరీ ఇంటర్నేషనల్ ద్వారా ప్రపంచవ్యాప్తంగా పలు సేవా కార్యక్రమాలు చేపడుతున్నామన్నారు. పోలియో మహమ్మారిని తరిమికొట్టేందుకు రోటరీ క్లబ్ ఇంకాస్త శ్రద్ధతో పనిచేయాల్సి ఉందన్నారు. అనంతరం టెన్త్, ఇంటర్ పరీక్షల్లో అత్యుత్తమ ప్రతిభ కనబరచిన 33 మంది విద్యార్థినీ, విద్యార్థులకు 36వేల రూపాయల నగదు పురస్కారాన్ని గవర్నర్ తన చేతుల మీదుగా అందించారు. ఈ కార్యక్రమంలో రోటరీ క్లబ్ అధ్యక్ష, కార్యదర్శులు కె.మధుసూధనరావు, కొంజేటి వెంకట సుబ్రహ్మణ్యం, రోటరీ మాజీ గవర్నర్ భరత్‌కుమార్‌రెడ్డి, జిల్లా కార్యదర్శి రాఘవేంద్రషెట్టి, పలువురు రొటేరియన్స్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## క్యాప్‌ను నేనెందుకు పెట్టలేకపోయాను?

శవ దహనాలు, సమాధుల మధ్య సహజీవనం సాగిస్తున్న బోడిగాడితోటలోని పిల్లలను గుర్తించి వారికి విద్యాబుద్ధులు నేర్పిస్తున్న నెల్లూరు ఎస్పీ రమణకుమార్ సేవలు ఎంతో బేషుగ్గా ఉన్నాయని మెరైన్ ఐజి కొత్తకోట శ్రీనివాసరెడ్డి ప్రశంసించారు. నెల్లూరు వచ్చిన ఆయన చైల్డ్ అండ్ పోలీస్ ప్రాజెక్ట్(క్యాప్) భవనాన్ని సందర్శించారు. అక్కడి పిల్లలతో కాసేపు ముచ్చటించారు. ఎస్పీ రమణకుమార్, శ్రీనివాసరెడ్డికి క్యాప్ ఆవిర్భావం, కొనసాగుతున్న తీరు వివరించారు. దీనికి మంత్రముగ్దుడైన శ్రీనివాసరెడ్డి తన సహజ ధోరణిలో క్యాప్ పిల్లలు దీపావళి చేసుకోను పదివేల రూపాయలు స్వంత డబ్బును ఎస్పీకి అందించారు.



క్యాప్‌లో పిల్లలను ఆప్యాయంగా పలకరిస్తున్న ఐజి శ్రీనివాసరెడ్డి.

ఆయనతో ఉన్న మెరైన్ డిఐజి ప్రసాద్, నెల్లూరు రూరల్ డిఎస్పీ బాల కోటేశ్వరరావు కూడా చెరో పదివేల రూపాయలు దీపావళి ఖర్చులకు అందించారు. 12 ఏళ్ల క్రితం జిల్లాలో ఎస్పీగా పనిచేసిన తనకు క్యాప్ వంటి పథకం ప్రవేశ పెట్టాలన్న ఆలోచన మదిలో మెదలకపోవడం పట్ల శ్రీనివాసరెడ్డి బహిరంగంగానే బాధను వ్యక్తం చేశారు. ఈ కార్యక్రమంలో అదనపు ఎస్పీలు చంద్రశేఖర్, నాగేశ్వరరావులు, సిఐలు కోటా రెడ్డి, రత్నం, మంగారావు, రామారావు, మురళి తదితరులు పాల్గొన్నారు.

## ఫీజుల వసూళ్లలో 'విక్రమ' సింహ!

### రాష్ట్రంలోని ఏ యూనివర్శిటీలో ఈ బాదుడు లేదు



ఇవేమి నిర్ణయాలు వైస్ ఛాన్సలర్ గారు.

నెల్లూరులోని విక్రమ సింహపురి యూనివర్శిటీలోలా రాష్ట్రంలోని ఏ యూనివర్శిటీ అధిక ఫీజుల వసూళ్లకు పాల్పడడం లేదని ఎబివిపి విద్యార్థి సంఘం ఆరోపించింది. ఈ మేరకు వైస్ ఛాన్సలర్ రాజారామిరెడ్డిని కలసి వినతిపత్రం అందించింది. ఈ సందర్భంగా ఎబివిపి నాయకుడు ఉదయకుమార్ మాట్లాడుతూ ప్రభుత్వం కల్పించిన ఫీజు రీయంబర్స్‌మెంట్ ద్వారా విద్యార్థులు, ఎంబిఏ, ఎంసిఏ కోర్సులను ఇతర యూనివర్శిటీల విద్యార్థులు సంవత్సరానికి మూడు వందల రూపాయల ఫీజుకే విద్యను అభ్యసిస్తుంటే విక్రమ సింహపురిలో మాత్రం ఒక్కో సెమిస్టర్ ఫీజు 750 రూపాయలు వసూలు చేయడం దారుణమన్నారు. వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఎంఏకు 285 రూపాయలు, ఎంఎస్‌సికి 350 రూపాయలు, కడప యోగివేమన యూనివర్శిటీలో ఎంఏకు 300 రూపాయలు, ఎంఎస్‌సికి 350 రూపాయలు, అనంతపురం ఎస్‌కెయూలో 210, 260 రూపాయలు పరీక్ష ఫీజులుగా వసూలు చేస్తుంటే విక్రమ సింహపురిలో మాత్రం ఎంఏకు 500, ఎంఎస్‌సికి 550 రూపాయలు వసూలు చేయడాన్ని తప్పుపట్టారు. దీనిపై వైఎస్ ఛాన్సలర్‌ను వివరణ అడగ్గా ఫీజులు విక్రమ సింహపురి యూనివర్శిటీలో ఎక్కువగా ఉన్నాయన్న విషయం తనకు తెలియదని, అధిక ఫీజులు వెంటనే తగ్గిస్తానని హామీ ఇచ్చారు. విసిగారు మరీ బావిలో కప్ప మాదిరి పనిచేస్తే ఎలా?

## దొంగలు బాబోయ్ దొంగలు!

### నెల్లూరును దొంగలకు రాసిచ్చారా?

నగరం దొంగల రాజ్యంగా మారింది. గడచిన ఇరవై రోజుల వ్యవధిలో రోజూ ఏదో ఒక ప్రాంతంలో దొంగలుపడి నగదు, నగలు తస్కరించుకొని పోతూనే ఉన్నారు. ఎన్నడూలేనట్లుగా ఇటీవల కాలంలో దొంగతనాలు అధికం కావడం, దొంగలు స్వైరవిహారం చేస్తుండడంతో నగర వాసులకు కంటిమీద కునుకు లేకుండా పోతోంది. ఎప్పుడు ఎక్కడ ఎవరింట్లో దొంగలు పడుతారోనని భయం భయంగా గడపాల్సిన పరిస్థితులు ఎదురౌతున్నాయి. పాత నేరస్తులు, జైలు నుంచి విడుదలౌతున్న నేరగాళ్ల కదలికలపై పోలీస్ నిఘా కొరవడడమే దొంగతనాలు జోరందుకోవడానికి ప్రధాన కారణమన్నది జగమెరిగిన సత్యం. పాత నేరస్తుల సహవాసంతో కొత్త దొంగలు పుట్టుకొస్తున్నారు. పోలీసులు ఈ దొంగతనాలను అరికట్టడంలో విఫలం కావడంతో నగర వాసులను దొంగల భయం వెన్నాడుతోంది. ఇటీవల జరిగిన దొంగతనాలను పరిశీలిస్తే ఈ విషయం తేటతెల్లమవుతుంది. అరవిందనగర్‌లోని న్యాయవాది ప్రభాకర్‌రావు ఇంట్లో దొంగలు పడి 38 సవర్లు దొంగిలించారు. పడారుపల్లిలో ఇంజనీర్ ఇంట్లో దొంగతనం జరిగి పెద్ద మొత్తంలో నగదు, నగలు అపహరణకు గురయ్యాయి. భక్తవత్సలనగర్‌లోని రిటైర్డ్ ఇంజనీర్ ఇంట్లోను, మూలపేట బ్రాహ్మణవీధిలో గల చంద్రశేఖర్ ఇంట్లోను, పోస్టల్‌కాలనీలో గల న్యాయమూర్తి ఇంట్లోను, తాజాగా రామలింగాపురంలో వ్యవసాయ శాస్త్రవేత్త రామచంద్రారెడ్డి ఇంట్లో దొంగతనం జరిగి పెద్ద ఎత్తున బంగారు ఆభరణాలు, వెండి వస్తువులు, డబ్బు దొంగలు దోచుకెళ్లారు. ఇరవై రోజులుగా దొంగలు స్వైరవిహారం చేస్తున్నా, దొంగతనాలు జోరందుకొంటున్నా వాటిని అరికట్టడంలోను, దొంగలను పట్టుకోవడంలోనూ పోలీసులు తగిన చర్యలు చేపట్టడం లేదన్న విమర్శలు వ్యక్తమౌతున్నాయి. అపరిచిత వ్యక్తుల కదలికలను పోలీసులకు తెలియజేయండి; ఇంటికి తాళం వేసి వెళ్లే సందర్భంలో సమీపంలోని పోలీస్ స్టేషన్‌కు సమాచారం ఇవ్వండనే ప్రకటనలకే పోలీసులు పరిమితమౌతున్నారు.

# కావలి ఏరియా ఆసుపత్రి వైద్యులను మందలించిన బీద!

**• తనిఖీలో సవాలక్ష లోటుపాట్లు కనిపించాయి**

ప్రజలు వైద్యులను దైవంతో సమానంగా పూజిస్తారని కానీ వైద్యుల్లో సేవాభావం కొరవడుతోందని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు ఆవేదన వ్యక్తం చేశారు. కావలి ప్రభుత్వ వైద్యశాలలో వైద్యసేవలు సక్రమంగా అందడంలేదని వస్తున్న ఫిర్యాదులపై స్పందించిన బిఎంఆర్ హాస్పిటల్‌ను ఆకస్మిక తనిఖీ చేశారు. ఆసుపత్రి ఆవరణం అపరిశుభ్రంగా వుండడంపై ఆగ్రహం వ్యక్తం చేశారు. ఓపి యూనిట్‌ను పరిశీలించిన ఆయన అక్కడ అందుతున్న వైద్యసేవలపై రోగులతో మాట్లాడారు. మందులు ఇవ్వడం లేదని తెలుసుకొని దానిపై ఆసుపత్రి ఇన్‌చార్జి డాక్టర్ కోటేశ్వరరావును ప్రశ్నించారు. దీనికి ఆయన సమాధానమిస్తూ కావలసిన మందులను ఇండెంట్ రూపంలో జిల్లా వైద్యాధికారికి పంపామని చెప్పడంతో ఎమ్మెల్యే వెంటనే జిల్లా వైద్యఆరోగ్యశాఖాధికారితో ఈ విషయమై ఫోన్‌లో మాట్లాడారు. డిఎంఅండ్ హెచ్ఓ మాసిలామణి సమాధానమిస్తూ కావలి నుంచి మందులు కావాలని ఎలాంటి ఇండెంట్ అందలేదని చెప్పి వెంటనే మందులను సరఫరా చేస్తామన్నారు. దీంతో శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు కావలి ప్రభుత్వ వైద్యులపై మండిపడ్డారు. మందులకు ఇండెంట్ పంపకుండానే పంపించారని అబద్ధాలు చెప్తారా అని నిలదీయడంతో వైద్యులు నీళ్లు నమిలారు. అలాగే శస్త్రచికిత్సల సమయంలో వాడే గ్లౌస్‌లు వినియోగించిన వాటినే తిరిగి వాడుతున్నారన్న ఫిర్యాదులపైనా వైద్యులకు క్లాస్ తీసుకున్నారు. ఆస్పత్రి సూపరింటెండెంట్ డాక్టర్ నాగమణి, సీనియర్ వైద్యులు సుబ్బారావు, ఆర్ఎంఓ వెంకటేశ్వర్లుతో మాట్లాడుతూ ఎన్నిసార్లు తనిఖీలు చేసినా, పద్ధతి మార్చుకోమని చెప్పినా మీలో మార్పురావడం లేదని, ఇది సిగ్గుపడాల్సిన విషయమన్నారు. తనిఖీలకు రావాలంటేనే తాను సిగ్గు పడాల్సి వస్తోందంటూ వ్యాఖ్యానించారు.

# ప్రభుత్వాసుపత్రులపై నమ్మకం కల్గించండి!

ప్రభుత్వ ఆస్పత్రులపై ప్రజల్లో నమ్మకం కల్గించాలని, ఆ దిశగా వైద్యులు తమ పనితీరును మెరుగుపరచుకోవాలని జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి డాక్టర్ మాసిలామణి సూచించారు. జలదంకి మండలంలో పర్యటించిన ఆయన ప్రజలకు అందుతున్న వైద్యసేవలపై ఆరా తీశారు. జలదంకిలో గల ప్రాథమిక ఆరోగ్యకేంద్రానికి వెళ్లిన ఆయన అక్కడ వైద్యసేవల కోసం వచ్చి వున్న రోగులతో మాట్లాడి సక్రమంగా వైద్యసేవలు అందుతున్నాయా? లేవా? అని ప్రశ్నించారు. కాన్పుల గదిని, రికార్డులను పరిశీలించిన వైద్యాధికారి పరిసరాలు అపరిశుభ్రంగా వుండడం, రికార్డులు గందర

## వైద్య ఆరోగ్య సిబ్బందికి డిఎంఅండ్‌హెచ్ఓ సలహా

గోళంగా వుండడంపై ఆగ్రహించారు. ఇలాగేనా ఆస్పత్రిని ఉంచుకొనేదని చిటపటలాడారు. మంచి మందులు ప్రభుత్వ వైద్యశాలల్లో వుంటున్నాయని వాటి గురించి ప్రజలకు వివరించాలని, పారిశుధ్యంపైనా అవగాహన కల్పించి విషజ్వరాల బారిన పడకుండా చూడాలన్నారు. జలదంకి ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని 24 గంటల వైద్యసేవలు అందే కేంద్రంగా మారుస్తామన్నారు. ఆక్సిజన్, మందుల కొరత వుంటే తన దృష్టికి తీసుకు రావాలన్నారు. పద్ధతి మార్చుకోకపోతే చర్యలు తప్పవని హెచ్చరించారు.

**• అధికారుల్లో చిత్తశుద్ధి లేక**

# అభివృద్ధి జరగడం లేదు!

గ్రామీణ ప్రాంతాల అభివృద్ధికి కేంద్రంలో పుష్కలంగా నిధులున్నా క్షేత్రస్థాయిలో అధికారుల్లో చిత్తశుద్ధి, నైపుణ్యం లేకపోవడం వల్లనే అభివృద్ధి జరగడం లేదని తిరుపతి ఎమ్పీ చింతామోహన్ వ్యాఖ్యానించారు. సూళ్లూరుపేట మున్సిపల్ కార్యాలయంలో శాసనసభ్యుడు పరసా రత్నంతో కలిసి ప్రభుత్వ పథకాల అమలుపై అధికారులతో సమీక్షించారు. సూళ్లూరుపేట మునిసిపాలిటీ అభివృద్ధికి తనవంతు సహాయ సహకారాలు అందిస్తానని హామీ ఇచ్చారు. అధికారులు ప్రణాళికలు సిద్ధం చేస్తే కేంద్రం నుంచి నిధులు విడుదల చేయిస్తానన్నారు. మేజర్ పంచాయితీ అయిన సూళ్లూరుపేట పరిధిని మాత్రమే మున్సిపాల్టీగా మార్చడాన్ని తప్పుపట్టారు. చుట్టూ వున్న చిన్న పంచాయితీలను కలుపుకొని వుంటే అభివృద్ధి చేసుకొనేందుకు అవకాశం వుండేదన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. సూళ్లూరుపేటలో భూగర్భ డ్రైనేజీ, త్రాగునీటి సౌకర్యం, రోడ్ల నిర్మాణాలకు తగిన అండదండలు అందించి పేటను సుందరంగా తీర్చిదిద్దే అవకాశం కల్పించాలని పరసారత్నం చింతామోహన్‌ను కోరారు. అలాగే ఆ ప్రాంత అభివృద్ధికి 222 కోట్లతో రూపొందించిన ప్రణాళికను ఎమ్పీకి అందజేశారు. ఈ సమావేశంలో మునిసిపల్ కమిషనర్ కనకారావు, తహశీల్దార్ రోజ్‌మాండ్, ఎంపిడిఓ బ్రహ్మయ్య తదితరులు పాల్గొన్నారు.

**తిరుపతి ఎమ్పీ చింతామోహన్ విమర్శ**

**• ఆక్సిజన్ లేక**

# శిశువు మృతి!

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో వైద్యమిలా?

జిల్లా వైద్యఆరోగ్యశాఖాధికారులు ఎన్ని హెచ్చరికలు చేస్తున్నా, పనితీరు మార్చుకోవాలని చెప్తున్నా వైద్య సిబ్బందిలో మార్పురాకపోవడం, ఆరోగ్య కేంద్రాలలో వైద్య చికిత్సలకు అవసరమైన మందులను, ఇంజక్షన్‌లను అందుబాటులో వుంచడంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుండడంతో ఆస్పత్రికి వచ్చే వారి ప్రాణాలు గాలిలో దీపంలా మారుతున్నాయి. పెళ్లకూరు మండలంలో జరిగిన ఘటన ఇందుకు నిదర్శనం. మండలంలోని చెంబేడు ఎస్సీ కాలనీకి చెందిన గూడలి పద్మ స్థానికంగా వుండే ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో మగబిడ్డకు జన్మనిచ్చింది. అక్కడి సిబ్బంది కష్టపడి కాన్పు చేసినా శిశువుకు ఊపిరి తీసుకోవడం కష్టమైంది. ఆస్పత్రిలో ఆక్సిజన్ సౌకర్యం లేకపోవడంతో శ్రీకాళహస్తికి తీసుకెళ్లాలని వైద్య సిబ్బంది సలహా ఇవ్వడంతో చేసేది లేక బిడ్డ, తల్లిని తీసుకొని వెళ్తుండగా మార్గమధ్యంలోనే ఆ బిడ్డ ప్రాణం విడచింది. చెంబేడు ఆస్పత్రిలో ఆక్సిజన్ సౌకర్యం కల్పించాలని చుట్టుప్రక్కల ప్రాంతప్రజలు పలుమార్లు ఉన్నతాధికారులను కోరినా ఫలితం లేకుండా పోయింది. దీంతో అత్యవసర సమయాల్లో రోగులు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోందని మండల ప్రజలు వాపోతున్నారు.

# ఉపాధిహామీ అక్రమాలపై విచారణ

వరికుంటపాడు మండలంలో ఉపాధిహామీ పథకంలో అవకతవకలు జరిగాయని వచ్చిన ఫిర్యాదులపై విచారణకు వచ్చిన బృందం తనిఖీలు చేపట్టింది. మండలంలో గత ఏడాది ఆగష్టు నుంచి ఈ సంవత్సరం ఆగష్టు వరకు 1,716 పనులకు సంబంధించి 3.55కోట్ల రూపాయలుఖర్చు చేశారు. ఇందులో పండ్లతోటల పెంపకం, పంచాయితీరాజ్ రోడ్లు పనులు వున్నాయి. అయితే మస్టర్‌లలో ఒకే రోజు కూలీలు రెండు చోట్ల పనులు చేసినట్లు నమోదై వుండడంపై ఆరోపణలు వచ్చాయి. రామాపురం పంచాయితీలో ఇలాంటివి జరిగి వున్నట్లు సమాచారం. కాకొల్లువారిపల్లెలో ఆర్అండ్‌బి రోడ్డు పనులను యంత్రాలతో చేసి 34 మంది కూలీలు పని చేసినట్లుగా వారికి 1.02 లక్షలు అందజేసినట్లు రికార్డులో నమోదు చేసి వుండడంపైనా ఫిర్యాదులు అందాయి. అలాగే తిమ్మారెడ్డిపల్లె, నార్తుకొండాయపాళెం, టి.కొండారెడ్డి పల్లెల్లో ఎక్కువ పనులు చేసినట్లు చూపడంపైనా వ్రాతపూర్వక ఫిర్యాదులు రావడంతో సామాజిక తనిఖీ బృందం వీటన్నింటిపై జరిపిన విచారణలో ఈ అక్రమాలు జరిగినట్లు గుర్తించారు. మరింతలోతుగా విచారణ జరిపితే మరిన్ని అక్రమాలు వెలుగుచూస్తాయని మండల ప్రజలు కోరుతున్నారు. మొత్తం మీద ఉపాధిహామీ పథకంలో త్రవ్వే కొద్దీ అక్రమాలు అవినీతి బయటపడుతూనే వున్నాయి.

**వరికుంటపాడులో లెక్కలేనన్ని బయటపడ్డాయి**

# అరటి తోటలపై నీలం ప్రభావం!



ఇందుకూరుపేటలో దెబ్బతిన్న అరటి తోటలు.

నీలం తుఫాను కారణంగా జిల్లాలోని పలు ప్రాంతాలలో గల అరటి తోటలకు తీవ్ర నష్టం వాటిల్లింది. అరటితోటలు అధికంగా వుండే కోవూరు నియోజకవర్గ పరిధిలో దాదాపు 80 హెక్టార్లలో పంట దెబ్బతినింది. ఇందుకూరుపేట మండలంలోని జగదేవిపేట, దేవిస్పేట, ఇందుకూరుపేట బిట్-2 గ్రామాల్లో అరటి తోటలు పూర్తిగా దెబ్బతిన్నాయి. అరటితోటల సాగులో ఆదాయం వుండడంతో కొన్నాళ్లుగా అరటిసాగు చేపడుతున్నారు రైతులు. ఈ దఫా నీలం తుఫాను ప్రభావంతో ఈ తోటలకు తీవ్ర నష్టం సంభవించింది. వర్షాలు, ఈదురు గాలులకు పలు ప్రాంతాల్లో అరటి తోటలు దెబ్బతిన్నాయి. దాదాపు కోటిరూపాయలకు పైగా నష్టం జరిగి వుంటుందని రైతులు వాపోతున్నారు. ఇంతగా తుఫాను రైతులను దెబ్బతీసినా పంట నష్టం అంచనా వేయడంలో గ్రామస్థాయి రెవెన్యూ అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని ఇందుకూరుపేట మండల రైతు సంఘం అధ్యక్షుడు ఎ.రమణయ్యనాయుడు విమర్శించారు. ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని తుఫాను వల్ల నష్టపోయిన అరటి రైతాంగాన్ని ఆదుకోవాలని, నష్టపరిహారం అందజేయాలని డిమాండ్ చేశారు.

# సంక్షేమ హాస్టళ్లలో విద్యార్థుల వెతలు!

సంక్షేమ హాస్టళ్ల విద్యార్థుల పరిస్థితి దయనీయంగా వుంది. ఇరుకు గదుల్లో ఎలాగోలా సర్దుకుపోతున్నా ఆహార విషయంలో మాత్రం వారు పడుతున్న బాధలు అన్నీఇన్నీ కావు. పురుగుపట్టిన, మక్కిపోయి వాసన కొడుతున్న బియ్యాన్ని భోజనానికి వినియోగిస్తుండడంతో ఆ పురుగుల అన్నం తినలేక, ఆకలి చంపుకోలేక కన్నీళ్ల పర్యంతం అవుతున్నారు పిల్లలు. ఈ పరిస్థితి ముత్తుకూరు మండలంలోని హాస్టళ్లలో కన్పిస్తోంది. పేద కుటుంబాల వారు తమ పిల్లలను చదివించుకోవడంతోపాటు ఆహారానికి ఇబ్బందులుండవని భావించి హాస్టళ్లలో చేర్పించే వారు అధికం. వసతి గృహాల్లో వుంటూ చదువుకొనే విద్యార్థుల పరిస్థితి అధికారుల నిర్లక్ష్యం, పర్యవేక్షణ కొరవడడం వలన దారుణంగా వుంటోంది.

## కడుపు నిండడం కనాకష్టమే!

పట్టెడు మెతుకులను తినే భాగ్యానికి నోచుకోలేక హాస్టల్ విద్యార్థులు పడుతున్న బాధ చూసే వారికి కన్నీళ్లు తెప్పిస్తోంది. మండలంలో బిసి, ఎస్సీ హాస్టళ్లు నాలుగు వున్నాయి. వీటిలో షుమారు రెండువందల మంది వరకు విద్యార్థులు వుంటున్నారు. వీరికి భోజనాన్ని అందించేందుకు పౌరసరఫరాలశాఖ గోడౌన్ల నుంచి బియ్యాన్ని సరఫరా చేస్తుంది. ఈ బియ్యం పరమనాసిరకంగా వున్నా దాన్నే వండి పెట్టాల్సి వస్తోందని హాస్టల్ సిబ్బంది చెప్తున్నారు. పిల్లల దయనీయ పరిస్థితిని అర్థం చేసుకొని జిల్లా కలెక్టర్ చొరవ చూపి హాస్టల్ విద్యార్థులకు నాణ్యమైన బియ్యాన్ని అందించాలని మండలంలోని విద్యార్థుల తల్లితండ్రులు కోరుతున్నారు.

# నిమ్మ మార్కెట్ యార్డ్‌పై విజిలెన్స్ దాడులు!

పొదలకూరులో గల నిమ్మ మార్కెట్ యార్డుపై విజిలెన్స్ అధికారులు ఆకస్మిక దాడులు చేశారు. విజిలెన్స్ ఎస్పీ ఆదేశాల మేరకు తనిఖీలు చేపట్టిన అధికారుల బృందం రికార్డులన్నింటిని క్షుణ్ణంగా పరిశీలించారు. నిమ్మకాయల లోడ్‌తో వెళుతున్న లారీలను నిలిపివేయించడంతోపాటు గేట్లను మూయించి తనిఖీలు చేశారు. యార్డులో ప్రతిరోజు ఎంతమేర

## పొదలకూరులో కలకలం

వ్యాపారం జరుగుతోంది, వ్యాపారులు మార్కెటింగ్‌శాఖకు సెస్‌ల రూపంలో ఎంతెంత చెల్లిస్తున్నారు అనే వివరాలను పరిశీలించారు. అలాగే సీజన్‌లో ఎంత వ్యాపారం జరుగుతుంది, అన్ సీజన్‌లో ఎంత జరుగుతుందనే దానిపైనా వివరాలు సేకరించారు. వ్యాపారులు ప్రభుత్వానికి ఎంత ట్యాక్స్ కడుతున్నది మార్కెటింగ్ అధికారులను ఆరాతీసిన విజిలెన్స్ అధికారులు ఆ శాఖ తీరుపై అసంతృప్తి వ్యక్తం చేశారు. వ్యాపారులు ఎంతెంత వ్యాపారం చేస్తున్నారు? ఎంత చెల్లిస్తున్నారు? అనే వివరాలు తెలుసుకోకుండా కేవలం 50 రూపాయల లెక్కన సెస్ కట్టించుకోవడంపై విస్మయం వ్యక్తం చేశారు. సీజన్‌లో లక్షల్లో వ్యాపారాలు చేస్తున్న సెస్ మాత్రం స్వల్పంగా చెల్లించడంపై ఆరా తీశారు. చేస్తున్న వ్యాపారానికి, కడుతున్న ట్యాక్స్‌కు పొంతన లేకుండా వుండడంపై విజిలెన్స్ అధికారులు మార్కెటింగ్ వారిని ప్రశ్నించగా వాళ్లు సరైన సమాధానం చెప్పలేకపోయారు. దీనిపై ఉన్నతాధికారులకు నివేదిక సమర్పిస్తామని విజిలెన్స్ అధికారులు రవికుమార్, ధనుంజయరెడ్డి తెలిపారు. అలాగే యార్డులో వ్యాపారులకు మార్కెటింగ్‌శాఖ కల్పిస్తున్న వసతుల కల్పనను అధికారులు పరిశీలించారు.



నెల్లూరు జెండావీధిలోని పివిఎంసి హైస్కూల్‌లో జరిగిన మైనార్టీ దినోత్సవంలో మాట్లాడుతున్న కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి.

# ఓడిన మునిసిపల్ అధికారులు!

అధికారులు ఎన్ని తప్పుడు కేసులు పెట్టినా చివరకు న్యాయమే గెలిచిందని కావలి తెలుగుదేశం పార్టీ సీనియర్ నేత, మాజీ కౌన్సిలర్ ఆత్మకూరి బ్రహ్మయ్య వ్యాఖ్యానించారు. అతనిపై మునిసిపల్ అధికారులు పెట్టిన కేసును న్యాయస్థానం కొట్టి వేయడంతో ఆయన హర్షం వ్యక్తం చేశారు. 2006వ సంవత్సరంలో పట్టణ పరిధిలో పేదలకు అందజేసే రుణాల విషయమై మునిసిపల్ అధికారులను బ్రహ్మయ్య ప్రశ్నించాడు. ఇరువురి మధ్య వాగ్వివాదం జరగడం అనంతర పరిణా

## కోర్టులో గెల్చిన బ్రహ్మయ్య

మాల నేపథ్యంలో మునిసిపల్ అధికారులు ఆయనపై క్రిమినల్ కేసు పెట్టారు. కావలి ఫస్ట్‌క్లాస్ అడిషనల్ మేజిస్ట్రేట్ కోర్టు కేసును విచారించి కొట్టి వేస్తూ తీర్పునిచ్చింది. ఈ సందర్భంగా ఆత్మకూరి బ్రహ్మయ్య మాట్లాడుతూ పేదల పక్షాన నిలబడినందుకు అధికారులు తప్పుడు కేసులు పెట్టినా న్యాయం తనవైపే వుండడంతో కేసు కొట్టి వేశారన్నారు. పేదల కోసం, వారి సమస్యల పరిష్కారం కోసం తనవంతు కృషి చేస్తానన్నారు. పలువురు టిడిపి కార్యకర్తలు కోర్టు తీర్పుపై ఆనందం వ్యక్తం చేశారు.

# ఉపాధి హామీ అవినీతి మయం!

## సూళ్లూరుపేట ఎమ్మెల్యే ఆరోపణ



ఉపాధిహామీ పథకం అవినీతిమయమైందని సూళ్లూరుపేట శాసనసభ్యుడు పరసారత్నం ఆరోపించారు. కూలీలకు ఉపాధి కల్పించాలన్న లక్ష్యంతో కేంద్రప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా చేపట్టిన ఈ పథకంలో అడుగడుగునా అవినీతి రాజ్యమేలు తుందన్నారు. ఓజిలి మండలంలో పర్యటించిన ఆయన వివిధ సమస్యలపై ప్రజలతో మాట్లాడి వారి నుంచి వినతి పత్రాలను స్వీకరించారు. అనంతరం మండల పరిషత్ కార్యాలయంలో జరిగిన సమావేశంలో ఆయన మాట్లాడుతూ ఉపాధిహామీ పథకం తీరుతెన్నులపై అసంతృప్తి వ్యక్తం చేశారు. క్షేత్రస్థాయిలో అవినీతి పెద్దఎత్తున జరుగుతున్నా అరికట్ట లేకపోవడంపై ఆగ్రహం వ్యక్తం చేశారు. ఉపాధిహామీ పథకంలాగా సాక్షరభారతి కార్యక్రమంలోనూ అవినీతి పెరిగిపోయిందన్నారు. దీపం పథకం క్రింద ఎంపిక చేసిన లబ్దిదారులకు గ్యాస్ కనెక్షన్లను పంపిణీ చేశారు. ఆరోవిడత భూపంపిణీ రాజకీయాలకు అతీతంగా చేపట్టాలని, అర్హులకు భూములుదక్కేలా చూడాలన్నారు. ప్రభుత్వ పథకాలు పేదలకు సక్రమంగా అందేలా అధికారులు చిత్తశుద్ధితో పని చేయాలన్నారు. అవినీతి, అక్రమాలకు పాల్పడితే సహించేదిలేదని హెచ్చరించారు. ఈ కార్యక్రమంలో తహశీల్దార్ ఈశ్వరమ్మ, ఎంపిడిఓ విజయేంద్రకుమార్, మండల తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు విజయ్ కుమార్ నాయుడు, సూర్యప్రకాశ్‌రావు, ధనుంజయరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

● ఇస్కపాళెంలో

# వేదసంస్కృత పాఠశాల!

## భారతీ తీర్థానందస్వామి చేతుల మీదుగా ప్రారంభం

ప్రతి ఒక్కరూ దైవభక్తిని, దాన మార్గాన్ని అలవరచుకోవాలని శృంగేరి పీఠాధిపతి శ్రీభారతి తీర్థానందస్వామి అభిభాషణ చేశారు. వెంకటాచలం మండలం ఇస్కపాళెంలో పెళ్లూరు సుధాకర్‌రెడ్డి ఏర్పాటుచేసిన వేద సంస్కృత పాఠశాల ప్రారంభోత్సవానికి విచ్చేసిన స్వామి భక్తులకు ఆధ్యాత్మికతను ప్రబోధించారు. ప్రజలందరూ విద్వేషాలు మాని వివేకవంతులై మెలగాలని, దైవ చింతనను కల్గివుండాలన్నారు. వేదం భారతీయతకు మూలమని, వేదాధ్యయనం ద్వారా ముందుకెళ్లాలన్నారు. త్యాగాలకు భారతదేశం పుట్టినిల్లని, సమాజహితం కోసం సర్వస్వాన్ని సమర్పించిన త్యాగభూమి భరత భూమని తెలిపారు. వేదసంస్కృత పాఠశాల ప్రారంభోత్సవానికి విచ్చేసిన శృంగేరి పీఠాధిపతి ఆశీస్సులు అందుకొనేందుకు, ఆయన దర్శనం చేసుకొనేందుకు చుట్టుప్రక్కల గ్రామాల నుంచి అధిక సంఖ్యలో భక్తులు రావడంతో ఆ ప్రాంతంలో భక్తి భావం శోభిల్లింది. స్వామి వారిని సర్వేపల్లి కూడలి నుంచి ప్రత్యేక రథంలో ఊరేగింపు నిర్వహించారు. ఇప్పటి వరకు సంస్కృత పాఠశాల నెల్లూరు మూలాపేటలో మాత్రమే వుండేది. అలాంటి పాఠశాలను వెంకటాచలంలో నెలకొల్పిన సుధాకర్‌రెడ్డిని పలువురు ఈ సందర్భంగా అభినందించారు. ఈ కార్యక్రమంలో సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి, విజయడైరీ ఛైర్మన్ కొండ్రెడ్డి రంగారెడ్డి, సెంట్రల్ బ్యాంక్ ఛైర్మన్ వేమారెడ్డి శ్యాంసుందర్‌రెడ్డి, తోట మనోహర్ తదితరులు పాల్గొన్నారు.

● సర్వేపల్లిని

# అభివృద్ధి చేశాను!

## ముత్తుకూరులో ఆదాల



మహిళా సంక్షేమానికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పెద్దపీట వేస్తున్నాయని సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి తెలిపారు. ముత్తుకూరు ఎంపిడిఓ కార్యాలయంలో జరిగిన దీపం లబ్దిదారులకు గ్యాస్ కనెక్షన్‌లు పంపిణీ చేసేందుకు విచ్చేసిన ఆయన మాట్లాడుతూ కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలోనే మహిళలు ఆర్థికంగా అభివృద్ధి చెందారన్నారు. రాష్ట్ర ప్రభుత్వం అమలు పరిచే అనేక పథకాలు మహిళల పేరు మీద ప్రవేశపెట్టడం ప్రభుత్వ చిత్తశుద్ధికి నిదర్శనం అన్నారు. సర్వేపల్లి నియోజకవర్గం అభివృద్ధి పథంలో వుందన్నారు. పారిశ్రామికంగా అభివృద్ధి చెందడంతోపాటు స్థానికులకు ఉద్యోగ, ఉపాధి అవకాశాలు లభిస్తున్నాయన్నారు. రైతుల సాగునీటి కష్టాలు తీర్చేందుకు కాలువ లైనింగ్ పనులను త్వరితగతిన చేపడుతున్నట్లు వివరించారు. త్వరలోఆరోవిడత భూపంపిణీలో అధిక సంఖ్యలో అర్హులైన పేదలకు ఇళ్ల స్థలాలను అందజేస్తామన్నారు. ఈ కార్యక్రమంలో విజయడైరీ ఛైర్మన్ కొండ్రెడ్డి రంగారెడ్డి, పెన్నార్‌డెల్టా ఛైర్మన్ దూవ్వూరు చంద్రశేఖర్‌రెడ్డి, ఈదూరు రామ్మోహన్‌రెడ్డి, ఎంపిడిఓ సుజాత, తహశీల్దార్ సుశీలమ్మ తదితరులు పాల్గొన్నారు.

దేవాదాయ భూముల

# ఆక్రమణలపై కేసు!

## జక్కేపల్లి గూడూరులో ఎనిమిది ఎకరాలు దురాక్రమణ

బోగోలు మండలంలో దేవాదాయ భూములను ఆక్రమించుకొన్నారన్న ఫిర్యాదుపై 26మందిపై పోలీసు కేసు నమోదు చేశారు. దీనికి సంబంధించిన వివరాలు ఇలా వున్నాయి. మండలంలోని జక్కేపల్లి గూడూరులో సోమేశ్వరస్వామి ఆలయం భూముల కౌలు వ్యవహారం ఆక్రమణలపై దేవాదాయశాఖ అసిస్టెంట్ కమిషనర్ యానాదిశెట్టి విచారణ జరిపారు. 16-2 సర్వే నెంబర్‌లో వున్న 8 ఎకరాల భూమిని శ్రీనివాసులు అనే వ్యక్తి కౌలుకు తీసుకొని కౌలు మొత్తం చెల్లించకపోవడంపై విచారించారు. దీనిపై ఆ వ్యక్తి మాట్లాడుతూ ఆ భూమిని అదే గ్రామానికి చెందిన 26 మంది ఆక్రమించుకొన్నారని తెలపడంపై తీవ్రంగా స్పందించారు. దేవాలయ భూమిని కౌలుకు తీసుకొన్న రైతులు సకాలంలో కౌలు మొత్తాన్ని కట్టకపోవడంతో ఆ భారం ఏడుగురు ఇఓలపై పడిందన్నారు. కౌలు కట్టకపోవడం సరైన విధానం కాదన్నారు. అనంతరం ఆలయ భూములు ఆక్రమించి ఇళ్లు కట్టుకోవడం, గడ్డివాములు వేసుకోవడం, పేడ దిబ్బలుగా వినియోగించుకోవడాన్ని పరిశీలించిన ఆయన పోలీసులకు ఫిర్యాదు చేశారు. పోలీస్ ఉన్నతాధికారుల నుంచి వచ్చిన ఆదేశాల మేరకు భూములు ఆక్రమించిన వారిపై పోలీసులు కేసు పెట్టారు. లీజు రద్దయిన రైతులు ఆ భూముల్లో సాగు చేపట్టినా అలాంటి వారిని అరెస్ట్ చేస్తామని ఎస్ఐ ఖాజావలి హెచ్చరించారు.



# అసైన్‌మెంట్ సమావేశం రసాభాస!

## కావలిలో జరిగిందిలా!

ప్రభుత్వం ఆరో విడత భూపంపిణీ కోసం లబ్ధిదారుల ఎంపిక కోసం జరిపిన అసైన్‌మెంట్‌కమిటీ సమావేశం కావలిలో రసాభాసగా మారింది. స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు ఆధ్వర్యంలో జరిగిన ఈ సమావేశానికి ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి పాల్గొని చర్చ ప్రారంభించారు. కావలి మినహా మిగతా మూడు మండలాల విషయాలపై మాట్లాడుతుండగా కాంగ్రెస్‌పార్టీ తరపున హాజరైన ఎల్లంటి వెంకటేశ్వర్లు, రజియా బేగం తదితరులు అడ్డు తగలడంతో గందరగోళం నెలకొనింది. ఐదో విడత భూపంపిణీలో లబ్ధిదారులుగా ఎంపికైన వారికి భూపంపిణీ చేయకుండా ఆరోవిడత భూపంపిణీ ఎలా చేపడుతారని వారు ప్రశ్నించారు. ముందు వారికి న్యాయం చేసి తర్వాతే ఆరోవిడత పంపిణీ జరపాలని పట్టుబట్టడంతో సమావేశం వేడెక్కింది. అధికారులు నచ్చచెప్పేందుకు ప్రయత్నించినా ఫలితం లేకుండా పోవడంతో వారు సమావేశాన్ని బహిష్కరించారు. ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు మాట్లాడుతూ అర్హులందరికి న్యాయం జరిగేలా చూస్తామన్నారు. ఇందులో ఎలాంటి రాజకీయాలు లేవని, ఆ విషయాన్ని అర్థం చేసుకోకుండా సమావేశం నుంచి వెళ్లిపోవడం సరైన పద్ధతి కాదన్నారు.

# దీపం గ్యాస్ సిలిండర్ల కుంభకోణం!

## • గూడూరులో 'మెప్మా' అధికారుల నిలదీత.

ఇందిరా క్రాంతి పథం ద్వారా ప్రభుత్వం పేదలకు అందజేస్తున్న గ్యాస్ కనెక్షన్లు గూడూరులో సక్రమంగా అందడం లేదు. అర్హులైన వారికి అందకుండా ఇవి ప్రక్కదారి పట్టడంపై గగ్గోలు రేగింది. పొదుపు సంఘాల మహిళలు ఈ విషయమై మెప్మా అధికారులను నిలదీయడంతో గందరగోళం చెలరేగింది. స్థానిక మెప్మా సిబ్బంది సోమశేఖర్, సుధాకర్‌లు తమకు అన్యాయం చేస్తున్నారని మహిళలు ఆరోపించారు. ఇది వివాదానికి దారి తీసింది. మెప్మా సిబ్బంది రెండు వర్గాలుగా విడిపోయి ఒకరిపై ఒకరు ఆరోపణలు చేసుకోవడంతో మహిళల ఫిర్యాదు కాస్త ప్రక్కదారి పట్టింది. ఈ విషయాన్నంతటిని ఏఓకు తెలియజేయడంతో ఆయన సమావేశానికి హాజరై మహిళల ఫిర్యాదులపై ప్రశ్నించారు. ఇది జరుగుతుండగానే కొందరు మహిళలు అక్కడకు చేరుకొని ప్రభుత్వం నుండి వచ్చే సంక్షేమ పథకాలు అర్హులకు అందకుండా పోతున్నాయని, సిబ్బంది అనర్హులకు వీటిని అందజేస్తున్నారని ఆరోపించారు. బ్యాంకు రుణాలు, గ్యాస్ కనెక్షన్‌లు, సబ్సిడీ పథకాలు ఏవీ తమ దరి చేరడం లేదన్నారు. అనుకూలంగా వుండేవారికే గ్యాస్ కనెక్షన్‌లు ఇవ్వడం ఎంతవరకు సమంజసం అని కేకలు వేయడంతో సమావేశం రసాభాసగా మారింది. దీంతో ఏఓ మహిళలపై ఆగ్రహించారు. సమావేశమా, బందెలదొడ్డా అని మండిపడ్డారు. అనంతరం ఆయన మాట్లాడుతూ గూడూరు పట్టణానికి మంజూరైన రుణాలు, గ్యాస్ కనెక్షన్ల పంపిణీలో మెప్మా సిబ్బంది అక్రమాలకు పాల్పడినట్లు వచ్చిన ఫిర్యాదులపై విచారిస్తామన్నారు. ఎవరైనా అవకతవకలకు పాల్పడి వుంటే వారిపై కఠినచర్యలు తీసుకుంటామని తెలిపారు.

## • ఉదయగిరిని

# వణికిస్తున్న జ్వరాలు!

## లబోదిబోమంటున్న జనం.

ఉదయగిరి ప్రాంతంలో ప్రబలుతున్న విషజ్వరాలు ప్రజలను వణికిస్తున్నాయి. మండల కేంద్రంతోపాటు చుట్టుప్రక్కల పలు గ్రామాల ప్రజలు జ్వరాల బారినపడి మంచం పట్టడంతో పల్లెలు జ్వరాలతో వణుకుతున్నాయి. టైఫాయిడ్, మలేరియా జ్వరాలతో పాటు కొందరికి డెంగ్యూ కేసులుగా అనుమానించడంతో అధిక సంఖ్యలో ప్రజలు ఆత్మకూరు నెల్లూరు, చెన్నై వెళ్లి వైద్యచికిత్స పొందుతున్నారు. పారిశుధ్యం అస్తవ్యస్తంగా మారడం, త్రాగునీరు కలుషితం అవుతుండడంతో దాదాపు 50 మందికిపైగా జ్వరాలు, వాంతులు, విరోచనాలతో ఆస్పత్రిపాలయ్యారు. కొండాయపాళెం మజరా దుర్గంపల్లిలో ఈ పరిస్థితి అధికంగా వుంది. గ్రామాల్లో పరిస్థితులు అస్తవ్యస్తంగా మారినా, ప్రజలు అనారోగ్యం పాలవుతున్నా వైద్యసిబ్బంది సక్రమంగా రావడం లేదని, సబ్‌సెంటర్ వున్నప్పటికీ ఎఎన్‌ఎం తదితర వైద్యసిబ్బంది జాడే కన్పించడంలేదని స్థానికులు వాపోతున్నారు. సమాచారం అందుకొని అక్కడకు వెళ్లిన ఎంపిడిఓ గురుశంకరావుకు బాధితులు తమ పరిస్థితిని ఏకరువు పెట్టారు.

● నలభై సీట్లు... మూడెకరాల నేల మోజులో...

# కాంగ్రెస్ తెప్పను వాగు మధ్యలో ముంచిన మజ్లిస్!




యాభై ఏళ్ల క్రితం జరిగిన ఒక ఎన్నికల ప్రచారంలో "కాడెద్దులు, ఎకరం నేల" అనే నినాదంతో పేద ప్రజలకు వల విసిరింది కమ్యూనిస్టు పార్టీ. ఆ కోవలోనే "నలభై సీట్లు, మూడెకరాల నేల" అనే తాయిలం చూపి మజ్లిస్ పార్టీని మచ్చిక చేసుకొన్నాడు వైఎస్.జగన్.

రాష్ట్ర రాజకీయాలలో మజ్లిస్ పార్టీది ఒక విలక్షణ శైలి. వారి కార్యస్థానం హైదరాబాద్‌లోని పాతబస్తీ మాత్రమే. నిర్లక్షరాస్యత, నిరుద్యోగం, దుర్భరమైన దారిద్ర్యాల సహచర్యంతో సతమతమయ్యే నిర్భాగ్య ముస్లిం ప్రజానీకంలో మత చాందస భావాలు రెచ్చగొట్టి రాజకీయంగా లాభపడడమే వారి రాజనీతి. 1960 దశకం నుంచి వారిది అదే తీరు. పాతబస్తీలో ఐదు అసెంబ్లీ స్థానాలు, ఒక ఎమ్పీ సీటు మాత్రమే వారి స్వంతం. తెలుగుదేశం ఉధృతంగా వున్న రోజులలో చంద్రబాబు నాయుడు పాతబస్తీలో వారి ఆధిపత్యానికి గండి కొట్టాడు. అప్పట్లో కేవలం రెండంటే రెండు అసెంబ్లీ సీట్లలో మాత్రమే గెలిచింది మజ్లిస్ పార్టీ. కానీ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి వచ్చిన తర్వాత వారికి ఎక్కడలేని ప్రాధాన్యత ఇచ్చారు. పాతబస్తీలో కొన్ని వేల కోట్ల రూపాయల విలువైన స్థలాలను ఒవైసీ సోదరులు, వారి అనుచరులు ఆక్రమించుకోవడాన్ని అనుమతించాడు వైఎస్. 2009 ఎన్నికలలో వారికి అనుకూలంగా బలహీనమైన కాంగ్రెస్ అభ్యర్థులను నిలబెట్టి, 7 సీట్లు గెల్చుకొనే అవకాశం కన్పించాడు. అందువల్ల వైఎస్ కుటుంబం అంటే అసదుద్దీన్ ఒవైసీకి ఎనలేని ప్రేమ. జగన్‌కు, కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీకి సంధి జరపడానికి పలు మార్లు ప్రయత్నం చేశారాయన. మొన్నటికి మొన్న సుప్రీం కోర్టులో జగన్ బెయిల్ కేసు విచారణకు వచ్చినప్పుడు కూడా, బెయిల్‌కు అనుకూలంగా న్యాయవాదుల మార్పుకు కాంగ్రెస్ పెద్దలను ఒప్పించింది కూడా ఒవైసీ కావడం గమనార్హం.

ఈ నేపథ్యంలో, కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వానికి మజ్లిస్ పార్టీ మద్దతు ఉపసంహరిస్తుందని అసదుద్దీన్ ఒవైసీ ప్రకటన చేయడం పరిశీలకులను పెద్దగా ఆశ్చర్యపరచలేదు.

కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వాన్ని కూలగొట్టాలన్నది వైఎస్ జగన్ లక్ష్యమన్నది జగమెరిగిన సత్యం. బెయిల్ నిరాకరణ తర్వాత జగన్‌లో ఆ పట్టుదల పెరిగిపోయింది. తన తండ్రి నుంచి తనకు వారసత్వంగా దక్కవలసిన కుర్చీలో కూర్చోవడానికి కిరణ్ ఎవడన్నది జగన్ ఆలోచన. రాష్ట్రంలో దాదాపుగా ఎన్నికల వాతావరణం వచ్చిన పరిస్థితులలో, టిక్కెట్ హామీ ఇస్తే తనవైపు రావడానికి కాంగ్రెస్ ఎమ్మెల్యేలు ఉత్సాహ పడుతుండడం జగన్‌లో కొత్త ఆశలు చిగురింప చేసింది. కిరణ్ సర్కారును కూలద్రోయడానికి ఇదే మంచి అదును అనే భావనతో, మొదటగా మజ్లిస్ పార్టీని ముగ్గులోకి దింపాడు జగన్. మజ్లిస్ నేతలకు కూడా కాంగ్రెస్‌తో కొనసాగడం ఇష్టం లేదు. ప్రజలలో పూర్తిగా పలుకుబడి కోల్పోయిన కాంగ్రెస్‌తో ఎక్కువ కాలం అంట కాగితే తమకే నష్టమన్నది వారి భావన. కాంగ్రెస్‌తో తెగ తెంపులకు సరైన అదును కోసం చూస్తున్నప్పుడు జగన్ నుంచి పిలుపు వచ్చింది వారికి. రేపటి ఎన్నికలలో జగన్ ప్రభంజనం ఉధృతంగా వీస్తుందన్న నమ్మకం అందరితో పాటు మజ్లిస్ నేతలకూ వుంది. తమ పార్టీని విస్తృత పరచుకోవడానికి జగన్ సహకారం తీసుకోవడం వారి ఆంతర్యం. పైగా కిరణ్ అంటే వారికి వ్యక్తిగతంగా కోపం వుంది.

కొరవ 14వ పేజీలో

# భానుకిరణ్ అనుచరుడు శ్యాం మరణం!

● గాలి జనార్దనరెడ్డి కొన్న భూమిలో వేలుపెట్టి ప్రాణం మీదకు తెచ్చుకొన్నాడు



విడవలూరు గ్రామానికి చెందిన పులుసు శ్యాం సుందర్ అనే రియల్ ఎస్టేట్ వ్యాపారి సిబిసిఐడి ఆఫీసులో గుండెపోటు వచ్చి మరణించాడు. సంచలనం సృష్టించిన ఈ మరణం వెనుక పెద్ద కథే వుంది. శ్యాంసుందర్ పేరుపొందిన బాస్కెట్ బాల్ క్రీడాకారుడు. జాతీయస్థాయి పోటీలలో కూడా పాల్గొన్నాడు. ఆర్‌ఎస్‌ఎస్‌లో కీలక కార్యకర్త. కొంత కాలం చిన్న చిన్న వ్యాపారాలు చేశాడు. వాటితో తృప్తి చెందక రియల్ ఎస్టేట్ రంగంలోకి దిగాడు. మంచి దేహదారుఢ్యం కల్గినవాడు కావడంతో, రియల్ ఎస్టేట్ వివాదాలలో తలదూర్చి, లాభపడడం అలవరచుకొన్నాడట. ఆ క్రమంలో అతడికి భాను కిరణ్‌తో పరిచయం ఏర్పడింది. భాను జరిపిన కొన్ని సెటిల్‌మెంట్లలో శ్యాం కూడా పాల్గొన్నాడట. భానుకు సంబంధించిన కొన్ని బినామీ ఆస్తులు శ్యాం స్వాధీనంలో పెట్టినట్లు చెప్తారు.

అయితే శ్రీకాళహస్తి సమీపంలోని 1400 ఎకరాల భూమి వివాదంలో భానుకు, శ్యాంకు విభేదాలొచ్చాయి. శ్యాం ఈ భూమి కొనుగోలు ఒప్పందం చేసుకొన్నాడట. అందులో తక్కువ రకం ఇనుప ఖనిజం వుందని వినికిడి. అప్పటికే మైనింగ్ మాఫియా సామ్రాట్టు గాలి జనార్దనరెడ్డికి ఆ భూమి సంబంధం వుండిందట. ఆ భూమి విడిచి వెళ్లమని గాలి అనుచరులు శ్యాంకు చెప్పారట. కానీ ఆయన విన్పించుకోలేదు. దానితో శ్యాం చిక్కుల్లో పడ్డాడు. భాను నుంచి కూడా ఒత్తిడి వచ్చింది. కోట్ల రూపాయలు చేసే ఆ భూమిని వదలుకోవడానికి శ్యాంకు మనసు ఒప్పలేదు. భానుతో యుద్ధానికి సిద్ధపడ్డాడు.

ఈ వివాదాలన్నీ తెలిసిన ఆర్‌ఎస్‌ఎస్ నాయకులు శ్యాంను తమ సంస్థ నుంచి దూరం పెట్టారు. దానితో రాజకీయ మద్దతు కోసం శ్యాం బిజెపి నేతలను ఆశ్రయించాడట. అయితే వారి నుంచి మద్దతు కానీ, ప్రోత్సాహం కానీ లభించలేదు. ఈ దశలో భాను అరెస్టు అయ్యాడు. భానుకు సంబం

కొరవ 14వ పేజీలో



నెల్లూరు నవాబుపేటవాసి, చిన్నపిల్లల కథా రచయితగా పేరు గాంచిన డాక్టర్ గంగిశెట్టి శివకుమార్ కుమారుడు శశిధర్, ఆశామాలతిల వివాహం 1తేది టిటిడి కళ్యాణ మండపంలో జరిగింది.



జొన్నవాడ కామాక్షితాయి దేవస్థానం కార్యనిర్వహణాధికారి వేగూరు రవీంద్రరెడ్డి కుమార్తె అఖిల, కోదండరామిరెడ్డిల వివాహం అక్టోబర్ 28తేది నెల్లూరులోని బాలపీరయ్య కళ్యాణ మండపంలో జరిగింది.



విక్రమ సింహపురి యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్‌గా పదవీ బాధ్యతలు చేపట్టి ఏడాది పూర్తి చేసుకున్న సందర్భంగా ఆచార్య రాజారామిరెడ్డిని అభినందిస్తున్న ప్రైవేట్ అన్ ఎయిడెడ్ డిగ్రీ పిజి కళాశాలల అసోసియేషన్ నాయకులు కోటంరెడ్డి ప్రతాప్‌రెడ్డి, సుబ్రహ్మణ్యం.




నెల్లూరులోని సృజన సంస్థ సామ్రాట్ క్లినిక్‌లో నిర్వహించిన సినిమా వినోదమా - వివాదమా చర్చా వేదికలో మాట్లాడుతున్న డాక్టర్ మారం సుధాకర్. వేదికపై అల్లూరు రహీం, కోటేశ్వరరావు, జి.రాజగోపాల్‌రెడ్డి, ఎ.వేంకట కృష్ణమూర్తి, ప్రశాంతి, ఆంజనేయరాజు.

# పరమ పవిత్రం కార్తీక మాసం!

పవిత్రమైన కార్యాలకు, ఆధ్యాత్మిక కార్యక్రమాలకు అనువైన మాసం కార్తీకమాసం. తెలుగు నెలల్లో ఎనిమిదవ మాసం ఇది. లయ కారకుడైన పరమశివునికి, స్థితి కారకుడైన మహావిష్ణువుకు ఎంతో ప్రీతికరమైన మాసం కార్తీక మాసమని పురాణాలు చెబుతున్నాయి. ఈ మాసంలో వచ్చే పౌర్ణమిని పరమ పవిత్రమైన రోజుగా భావిస్తారు. మహాశివరాత్రితో సమానమైన పుణ్య దినం. కార్తీక పూర్ణిమను త్రిపురి పూర్ణిమ అని, దేవ దీపావళి అని కూడా అంటారు. ఆశ్వీయుజ అమావాస్య (దీపావళి) వెళ్లిన మరునాడు నుంచి కార్తీక మాసం ఆరంభమైంది. కార్తీక మాసం ప్రారంభమైన నాటి నుంచి ముగిసే వరకు ప్రతిరోజు సాయంత్ర వేళ దీపాలు వెలిగిస్తారు. వీటిని కార్తీక దీపాలంటారు. ఈ మాసంలో వచ్చే కార్తీక సోమవారాలు, పూర్ణిమ పర్వదినాల్లో విశేష పూజలు నిర్వహించడంతోపాటు ఉపవాసాలు వుండి దైవ దర్శనం చేసుకొంటే పుణ్యం లభిస్తుందని చెప్తారు. కార్తీక మాసమంతా కార్తీక మహాపురాణాన్ని పారాయణం చేస్తారు. అలాగే ఆలయాల్లో కార్తీక పురాణ శ్రవణం చేస్తారు.

కార్తీక మాసంలో, ముఖ్యంగా కార్తీక పౌర్ణమి నాడు దీపం వెలిగిస్తే తెలిసీ తెలియక చేసిన పాపాలన్నీ హరించుకపోతాయి. ఆరోజున తెల్లవారుజామున సముద్రం లేదా నదిలో స్నానం చేయడం శుభప్రదం. కార్తీక సోమవారాలు, పౌర్ణమిరోజులు శివుడికి, విష్ణువుకు ప్రియమైన రోజులు కాబట్టి శివాలయాల్లో రుద్రాభిషేకాలు, సత్యనారాయణ వ్రతాలు చేయడం శ్రేష్టం. ఎంతో పుణ్యప్రదమైన రోజుల్లో ఉపవాసం వుండి సాయంత్రం వత్తితో దీపాలను వెలిగించి అరటి దొన్నెపై వాటిని వుంచి నది లేదా కొలనులో వదులుతారు. శివాలయాల్లోను దీపాలు వెలిగిస్తారు. వీటిని ఆకాశ దీపాలు అంటారు. ఇంటిలో దేవుని ముందు, తులసికోట ఎదుట దీపం వెలిగించడం చేస్తారు. కార్తీక పౌర్ణమి రోజున శివాలయంలో దీపారాధన చేయడం వల్ల ముక్కోటి దేవతలను పూజించిన పుణ్యం లభిస్తుందని, సకల పుణ్య నదుల్లో స్నానం చేసిన ఫలం దక్కుతుందని సఖల సౌఖ్యాలు లభిస్తాయని పురాణాలు చెప్తున్నాయి. పురాణ కథనాన్ని అనుసరించి కార్తీకేయుడు తారకాసురుని సంహరించిన రోజే కార్తీక పౌర్ణమి. ప్రజలను పలురకాలుగా హింసలకు గురి చేస్తున్న తారకాసురుడిని వధింపబడడంతో ప్రజలు ఆనందంతో దీపాలు వెలిగించి సంబరం చేసుకొన్నారు. వెయ్యేళ్ల రాక్షసుల పాలన అంతరించిన శుభసందర్భంగా పరమ శివుడు తాండవం చేశాడని పురాణాల్లో వివరించబడింది. జల ప్రదేశాల్లో అనంతశయుడైన శ్రీమహావిష్ణువు వుంటాడని భావించి నదీనదాల్లో దీపాలను వెలిగించి నీళ్లలో వదులుతుంటారు.

పద్మపురాణంలోని ఉత్తరకాండలో ఈ కార్తీక మాసం యొక్క విశిష్టత తెలియజేయబడింది. ఎన్నో వైశిష్ట్యాలకు నెలవైన కార్తీక మాసంలో చేయబడే పూజా కార్యక్రమాలని కార్తీక మాస వ్రతంగా చెబుతారు. ఈ మాసంలో భక్తులంతా సాత్వికాహారాన్ని భుజించాలి. ఒంటిపూట మాత్రమే భోజనం చేస్తూ ఉపవాసం వుండాలి. రోజు వుండకపోయినా ముఖ్యమైన, విశిష్టమైన కార్తీక సోమవారాలు, కార్తీక ఏకాదశి, కార్తీక పూర్ణిమల్లో ఉపవాసం వుండి, అభ్యంగన స్నానమాచరించి సాయంత్రం వేళ వీధిగుమ్మంలో దీపం పెట్టాలి. కార్తీక మాసంలో రోజూ కార్తీక పురాణంలో ఒక అధ్యాయనాన్ని చదివినా నాలుగు పుణ్యక్షేత్రాలు దర్శించినంత పుణ్యం కల్గుతుందని పండితుల అభిప్రాయం. అలాగే ఈ మాసంలో సోమవార వ్రతం చేస్తారు. శివుడికి సోమేశ్వరుడు అనే పేరుంది. సోమ అంటే చంద్రుడు. అలాంటి చంద్రుడిని తలపై వుంచుకొన్నవాడు కాబట్టి సోమేశ్వరుడైనాడు. ఆ సోమేశ్వరుని కటాక్షం కోసం



కార్తీక సోమవారాలు ఉపవాసం చేస్తారు. ఉపవాసం అంటే ఏమి తినకుండా వుండడం కాదు. ఉప అంటే దగ్గరగా, వాసం అంటే వుండడం. భగవంతునికి దగ్గరగా వుండడమనే అర్ధం. అరిషడ్వర్గాలైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను అణచివేసి భగవంతునిపై దృష్టి నిలపడం వల్ల కార్తీక మాసంలో కాళేశ్వర, కరిరాజవరదుల కటాక్ష వీక్షణాలు లభిస్తాయని చెప్తారు. J

# వారఫలాలు

*తేది 17-11-2012 నుండి 23-11-2012 వరకు వృషభంలో గురు, కేతువులు; తులలో శుక్ర, శనులు; వృశ్చికంలో రాహువు 19తేది వరకు తదుపరి వక్రీకరించి తులలో; ధనుస్సులో కుజుడు; ధనుర్మకర, కుంభ, మీనాలలో చంద్రుడు సంచరిస్తారు.*




కుటుంబ వ్యక్తుల సహకారంతో మానసికంగాను, దృఢంగాను, ఉల్లాసంగానూ వుంటూ తలపెట్టిన అన్ని కార్యక్రమాల్లోనూ చురుకుగా పాల్గొంటారు. మీ ప్రతిభను గుర్తించేవారుంటారు. అవసరానికి డబ్బు చేతికందుతుంది. దీర్ఘకాలంగా సాగుతున్న సమస్యలకు త్వరలో పరిష్కారాలుంటాయి. వృత్తి, వ్యాపారాలు రాణిస్తాయి. విద్యార్థులు తోటి వారితో ఆనందంగా గడుపుతారు. వ్యవసాయాభివృద్ధి సాగుతుంది.




ఆర్థికపరమైన ఇబ్బందులు తొలగి నూతన కార్యక్రమాలు చేపడతారు. నిరుద్యోగులకు ఉద్యోగావకాశాలు, దూరపు బంధువుల నుండి శుభవార్తలు అందుతాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి తగిన గుర్తింపు వుండదు. సామాన్య ఆదాయాలుంటాయి. విద్యార్థులు చదువుపై శ్రద్ధ వహించాలి. వ్యవసాయదారులకు అధిక ఖర్చులు తప్పకపోవచ్చు. రాజకీయులు నూతనోత్సాహంతో వుంటారు.




తలపెట్టిన పనులు నిదానంగా సాగుతాయి. శరీర అలసట, నిలకడలేని మనస్సుతో బాధలుంటాయి. నూతన కార్యక్రమాలకు సరైన ఆలోచనలు చేయాలి. మీ వ్యక్తిగత విషయాలలో ఇతరుల ప్రమేయాన్ని పెరగనీయకండి. వృత్తి, వ్యాపార లావాదేవీలు ఉత్సాహంగా సాగుతాయి. విద్యార్థులు అందరిలో ప్రత్యేక గుర్తింపు పొందుతారు. వ్యవసాయదారులకు అలసత్వం పనికిరాదు.




చేపట్టిన పనులన్నీ స్వల్ప వ్యవధిలో పూర్తి చేస్తారు. అయితే కొన్ని పనులు వాయిదా పడతాయి. దూర ప్రాంతాలకు ఆకస్మిక ప్రయాణాలు, బంధుమిత్రులతో మాటపట్టింపులుంటాయి. వృత్తి, వ్యాపారాలు మందగిస్తాయి. విద్యార్థులు విద్యా వ్యాసాంగాలు కొనసాగిస్తారు. వ్యవసాయదారులు తమ పనులలో కొంత ముందడుగు వేస్తారు. కళా, క్రీడా రంగాలవారు నిదానంతో వ్యవహరించాలి.




ఇంట్లో శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. తలపెట్టిన పనులన్నీ ప్రయత్నపూర్వకంగా ఫలిస్తాయి. అనుకోని ప్రయాణాలు వల్ల శరీర అలసట. ఇంటా బయట ఒత్తిడులు, ఆరోగ్య భంగం. సంతానాభివృద్ధికి అనుకూలతలు సాధిస్తారు. కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తాయి. విద్యార్థులు పురోభివృద్ధిని సాధిస్తారు. వృత్తి, వ్యాపారాలు మందకొడిగా సాగినా ఆర్థికాదాయాలుంటాయి.




నూతన విషయాలపై ఆసక్తి వుంటుంది. చాలాకాలం నుండి పరిష్కారం కాని ఆస్తి వివాదాల నుంచి బయటపడతారు. మీ ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. వృత్తి, వ్యాపారాభివృద్ధికి ఆదాయ మార్గాలు పెంచుకొనే మార్గాలు అన్వేషిస్తారు. వ్యవసాయదారులకు యత్న కార్యసిద్ధి, ధనవృద్ధి. కళా, క్రీడా రంగాల వారు నూతన కాంట్రాక్టులు పొందుతారు. రాజకీయులు మాటల్లో జాగ్రత్త వహించాలి.




తలపెట్టిన పనులు శుభాశుభమిశ్రమంగా వుండి బంధుమిత్రుల సహకారం వుంటుంది. కొన్ని పనులు వాయిదా వేయడం మంచిది. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ఆర్థికంగా పర్వాలేదు. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటారు. నూతన వ్యక్తుల పరిచయాలుంటాయి. విద్యార్థులకు అనుకూలమైన కాలం. వ్యవసాయదారులకు ఆర్థిక ఇబ్బందులు తొలగుతాయి.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారు అదనపు ఆదాయంతో ఉత్సాహంగా వుంటారు. మీ తెలివితేటలతో గుర్తింపు తెచ్చుకొంటారు. ఉద్యోగులకు అధికారుల ఒత్తిడులుంటాయి. వ్యవసాయదారులకు ఆర్థికంగా పర్వాలేదనిపిస్తుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి పని ఒత్తిడి వుంటుంది. రాజకీయ రంగంలోని వారు ఆత్మీయులతో ఉత్సాహంగా కాలం గడుపుతారు.




ఈ రాశి వారికి అనుకూలమైన వారం. తలపెట్టిన పనులు సకాలంలో పూర్తి చేస్తారు. ఆత్మీయుల, శ్రేయోభిలాషుల సహాయ సహకారాలుంటాయి. ఆస్తి వివాదాలకు త్వరలోనే పరిష్కారాలు లభిస్తాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థిక వ్యవహారాలు సంతృప్తినిస్తాయి. కోర్టు వ్యవహారాలు వాయిదా వేయడం మంచిది. విద్యార్థులకు ప్రోత్సాహకరంగా వుంటుంది.




చిన్న చిన్న ఇబ్బందులున్నా అనుకున్న పనులు పూర్తి చేస్తారు. చాలా యోగ్యదాయకమైన కాలం. ఆర్థిక విషయాలు లాభిస్తాయి. వృత్తి, ఉద్యోగాల వారికి చిన్న చిన్న ఆటంకాలు తప్పవు. నూతన గృహ యత్నాలు ఫలిస్తాయి. విద్యార్థులకు ప్రోత్సాహకరంగా వుంటుంది. వ్యవసాయదారుల పనితీరు ఆర్థికాదాయాన్ని తెస్తుంది. కళా, క్రీడా రంగాలలోనివారు వృత్తి విషయాలలో అన్యులను నమ్మకండి.




ఈ రాశి వారు చేసే పనులలో ప్రగతి శూన్యం. అన్ని రంగాల వారు పూర్తిస్థాయిలో రాణించలేకపోతారు. శారీరక, మానసిక ఆందోళనలు తప్పవు. అనవసర ప్రయాణాల వల్ల శ్రమ, అలసట. వృత్తి, వ్యాపారాలు మందకొడిగా సాగుతాయి. విద్యార్థుల ఆలోచనలు కలసి వస్తాయి. వ్యవసాయదారులు తమ పనులలో చిన్నపాటి ఇబ్బందులు ఎదుర్కొంటారు




ఈవారం సామాన్యంగానే వుండి చేసే పనులు వాయిదా పడటం లేదా ఆలస్యంగా జరగడం వుంటుంది. బంధుమిత్రులతో విభేదాలు, అపోహలు ఏర్పడగలవు. శరీరారోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. ఆర్థిక విషయాలలో వివాదాలు ఏర్పడగలవు. వృత్తి, వ్యాపారాలలోనివారు ఆర్థికాదాయాలకు నూతన అన్వేషణ సాగిస్తారు. వ్యవసాయదారులు ఎన్ని పనులున్నా దృఢంగా వుంటారు.

## పంచాంగం

17తేది నాగుల చవితి.
18తేది నాగ పంచమి.
19తేది అగ్ని షష్ఠి, కోటి సోమవారం, తిరుమల పుష్పయాగం, అనూరాధ కార్తె.

### శుభ ముహూర్తాలు

17, 18, 19, 21, 23తేదీలలో వివాహ, గృహ ప్రవేశాలు, ఉపనయన, అక్షర స్వీకారాలు, నిశ్చితార్థ, క్రయవిక్రయాది ముహూర్తాలకు మరియు సీమంత, అన్నప్రాసనాది శుభకార్యాలకు శుభ ముహూర్తాలున్నాయి.

### నవంబర్ తిథులు
### కార్తీక శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 17 | శని | చవితి | ప | 01.53 గం.ల.వ |
| 18 | ఆది | పంచమి | ప | 11.22 గం.ల.వ |
| 19 | సోమ | షష్ఠి | ప | 09.29 గం.ల.వ |
| 20 | మంగళ | సప్తమి | ఉ | 08.19 గం.ల.వ |
| 21 | బుధ | అష్టమి | ఉ | 07.52 గం.ల.వ |
| 22 | గురు | నవమి | ఉ | 08.08 గం.ల.వ |
| 23 | శుక్ర | దశమి | ప | 09.05 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

# కుజ, శుక్ర సంక్రమణం 'దృష్టి' దాంపత్య విభేదములు!

*ఎన్.రుక్మిణీదేవి — చెన్నై*

** స్త్రీ, పురుషుల మధ్య విభేదములు, విపరీత పరిణామాలెందు వల్ల జరుగుతాయి?*

శాస్త్రపరంగా శుక్రుడు, కుజుడు సమగ్రహములు. వాటి కలయిక మాత్రం విపరీత పరిణామాలకు దారి తీస్తుంది. అవి మిత్ర గ్రహాలు కాకపోవడమే ఇందుకు కారణం. ఈ దోషాల వల్ల అట్లా జరుగుతుంది.

*డా॥ మిశ్రా — చెన్నై*

** చంద్రుడి ప్రభావాన్ని మనుషులపై మీరు నమ్ముతారా?*

వశిష్ట నిర్ధారిత సూత్రాలను మీరు హేళన చేస్తున్నారు. సోడియం, కాల్షియం, పొటాషియం, మెగ్నీషియం లవణాలు కల్గిన సముద్రమే చంద్ర ప్రభావానికి అతలాకుతలమైనప్పుడు, అవే లక్షణాలున్న మనిషిపై ఆ ప్రభావం వుండదని మీరు ఎలా చెప్పగలుగుతారు.

*టి.వి.సుదర్శన — నాయుడుపేట*

** 'పంచాంగం' అంటే అర్థం చెప్పండి?*

వారం, నక్షత్రం, తిథి, యోగం, కరణం అనునవి పంచాంగాలు.

*ఎం.శకుంతలాదేవి — సూళ్లూరుపేట*

** 'దృష్టి' ఉన్నదా?*

శరీరంలోని శక్తి కేంద్రాలు కళ్లు. విద్యుద్రప్రకాశ తీవ్రత వల్ల 'దిష్టి' ఏర్పడుతుంది. 'దిష్టి'ని శాస్త్రాలు అంగీకరిస్తున్నాయి.

*ఖాదర్ మొహిద్దీన్ — కడప*

** గ్రామ నిర్మాణంలో కట్టుబాట్లు ఏవి? ఫలితాలెలా ఉంటాయి.*

గ్రామం ఆగ్నేయం, వాయువ్య దిశలలో పెరగకూడదు. గృహస్థుల ఆర్థిక విషయంలో అభివృద్ధి ఉండదు.

*సి.శ్రీకంఠ — మదనపల్లె*

** గృహ నిర్మాణాలు చైత్రం, జ్యేష్ఠ, బాద్రపద మాసాలలో ఎందుకు చేయకూడదు?*

భయం, మృత్యువు, రోగం వంటి లక్షణాలు పై మాసాలలో ఉన్నందు వల్ల గృహ నిర్మాణ ప్రారంభాలు చేయకూడదని శాస్త్ర ఉవాచ.

*డి.శ్రావణి — నెల్లూరు*

** పుట్టుమచ్చ పెదవిపై ఉంటే ఏమౌతుంది?*

వ్యక్తి తిండిపోతవుతాడు.

*డాక్టర్ కమలాకర్ — చెన్నై*

** భూమి పుత్రుడైన అంగారకుడిలో జీవం ఉన్నదా?*

వరాహ మిహిర సంహితలో అంగారకుడు భూమి పుత్రుడుగా వర్ణింపబడ్డాడు. సూర్యుడికి భూమి మూడో గ్రహమైతే అంగారకుడు నాలుగవ గ్రహం. దీన్ని మృతగోళం అంటారు. ప్రస్తుత జీవం లేనట్లే.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*రమారెడ్డి — చెన్నై*

** గృహాల్లో ఎక్కువగా ఎలాంటి దోషాల్ని మీరు గమనిస్తుంటారు?*

గృహాల్లో సెప్టిక్ ట్యాంకులు, మెట్లు, ప్రహరీ నిర్మాణాలు, నాభి, కమల, బ్రహ్మస్థానాలు తప్పిదాలు విపరీతంగా ఉంటున్నాయి.

*సి.అనితారెడ్డి — బెంగుళూరు*

** స్త్రీ, పురుషుల అన్యోన్యత విషయంలో మహర్షులు ఏ యంత్రం సూచించారు?*

అగస్త్య గృహ్య సూత్రాలలో దంపతుల నక్షత్రాలను బట్టి యంత్రాలు, నవరత్నాలు సూచించబడ్డాయి. సమస్యలున్న వారు సంప్రదిస్తే నక్షత్ర గణనచేసి సూచించడం జరుగుతుంది.

*పి.రజని — నెల్లూరు*

** ఆగ్నేయ పడక గది ఉంది. మానసికంగా సుఖశాంతులు లేవు.*

ఆగ్నేయం దంపతీ కలహం అని వాస్తురత్నాకరం చెబుతోంది. దాని పరిష్కారాలలో యంత్ర ప్రతిష్ట కూడా ఒకటి.

*ఎన్.శంకరాచారి — నెల్లూరు*

** వాస్తును నేను పాటించలేదు. అయినా అష్ట అయిశ్వర్యాలతో తులతూగుతున్నాను.*

శుక్ర మహర్దశ ఉన్నప్పుడు ఏ దోషాలున్నా పట్టింది బంగారం అవుతుంది. డిసెంబర్ 21వతేదీ తర్వాత రాహు దశ వ్యతిరిక్తంగా జరుగుతుంది. వాస్తు దుష్ప్రభావాలు అప్పటి నుంచి ప్రారంభమవుతాయి.

# ఉపాధిహామీ నిధులను పప్పుబెల్లాల్లా చప్పరించేశారు!

**జిల్లాలో ఉపాధిహామీ పథకం కోసం విడుదల చేసిన నిధులను సిబ్బంది, స్వచ్ఛంద సంస్థలు ఒక పథకం ప్రకారం స్వాహా చేశారని సామాజిక తనిఖీల్లో తేలింది. వీరి నుంచి ఈ డబ్బును రికవరీ చేయడమా లేదా పోలీస్ స్టేషన్‌లో కేసు పెట్టడమా అనే విషయమై అధికారులు ఇంకా తర్జన భర్జనల్లోనే ఉన్నారు.**

"ఉపాధిహామీ" పథకం నిధులను స్వాహా చేసిన అక్రమార్కులపై చర్యలు తీసుకునేందుకు ఆ శాఖ ఉన్నతాధికారులు రంగం సిద్ధం చేశారు. ఈ పథకం ప్రారంభ దశ నుంచి అవకతవకలు చోటు చేసుకున్నాయి. ప్రారంభంలోనే అక్రమాలను గుర్తించి చర్యలు తీసుకొని వుంటే కోట్ల రూపాయల ప్రభుత్వ నిధులు దుర్వినియోగం కాకుండా వుండేవి. అయితే ఈ పథకం అమలు చేస్తున్న జిల్లా నీటి యాజమాన్య సంస్థకు అధికారులను తరచూ బదలీ చేయడం వలన క్రిందిస్థాయి సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ వచ్చారు. 2006వ సంవత్సరంలో ప్రారంభమైన ఉపాధిహామీ పథకంకు ఇప్పటి వరకు ఐదుగురు అధికారులు మారారు. బాధ్యతలు చేపట్టిన ప్రతి అధికారి ఒక్కో విధానం అవలంభించడంతో నిధుల దుర్వినియోగానికి అవకాశం ఏర్పడింది. ఇప్పటివరకు దాదాపు 5కోట్లకు పైగా నిధులు ప్రక్కదారి పట్టినట్లు అధికారులు గుర్తించారు.

వివిధ మండలాల్లో నిర్వహించిన సామాజిక తనిఖీల్లో నిధులు దుర్వినియోగం జరిగిన విషయం బహిర్గతమైంది. కూలీలకు చెల్లించాల్సిన నిధులను సకాలంలో చెల్లించకపోవడం, ఒకసారి చేసిన పనులను మళ్లీ చేసినట్లు చూపించడం, తక్కువ పనులకు ఎక్కువ నిధులతో ప్రతిపాదనలు సమర్పించడం కూలీలకు అసలు కంటే తక్కువ మొత్తంలో నగదు చెల్లించడం, సామాగ్రిని కొనుగోలు చేయడం వంటి అక్రమాలకు మండలస్థాయిలో విధులు నిర్వహించే సిబ్బంది పాల్పడ్డారన్న ఆరోపణలు వున్నాయి. సిబ్బంది చేతివాటం ప్రదర్శిస్తుండడాన్ని నియంత్రించాలన్న వుద్దేశ్యంతో స్వచ్ఛంద సంస్థల ఆధ్వర్యంలో కూలీలకు నగదు చెల్లించాలని అధికారులు నిర్ణయించారు. ఇందులో భాగంగా కొన్నిసంస్థలకు బాధ్యతలు అప్పగించారు. ఎంపిక చేసిన సంస్థలకు ముందుగానే నిధులు విడుదల చేసినప్పటికి కూలీలకు నగదు చెల్లించడంలో ఆ సంస్థ ప్రతినిధులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు.

ఉపాధి హామీలో నిధులు దుర్వినియోగంపై దృష్టిసారించి అసలు బాధ్యులపై చర్యలు తీసుకోవాలని డ్వామా పిడిగా ఇటీవల బాధ్యతలు చేపట్టిన గౌతమి అధికారులను ఆదేశించారు. ప్రధానంగా సీడ్ అనే సంస్థ ఖాతాలో మూడు కోట్ల రూపాయలు అధికారులు జమ చేశారు. ఈ నగదును కూలీలకు చెల్లించాల్సి వున్నప్పటికి ఆ దిశగా ఆ సంస్థ ప్రతినిధులు కృషి చేయకపోగా, అధికారులు ఎన్నిసార్లు ప్రయత్నించిన స్పందన రాలేదు. దీంతో తప్పని పరిస్థితుల్లో మూడోనగర పోలీస్‌స్టేషన్లో కేసు నమోదు చేసినట్లు అధికారులు చెప్పారు. బాలాయపల్లి, దక్కిలి తదితర మండలాల్లో ఉపాధిహామీ పథకంలో విధులు నిర్వహిస్తున్న సిఎస్పీలకు గత ఆరు నెలలుగా వేతనాలు కూడా చెల్లించలేదు. అనేక పర్యాయాలు అధికారుల దృష్టికి తీసుకెళ్లినా సీడ్ సంస్థ నిర్వాహకులను సంప్రదించాలని సలహా ఇచ్చి పంపేవారు.

కూలీలకు చెల్లించాల్సిన కోట్ల రూపాయలను బ్యాంకు ఖాతాలో జమ చేసుకొని పత్తా లేకుండా పోయిన వారిని అరెస్టు చేసేందుకు పోలీసులు రంగం సిద్ధం చేస్తున్నారు. ఇదిలా వుండగా అధికార పార్టీ నేతల సహకారంతో నిధులు దుర్వినియోగానికి పాల్పడిన సాంకేతిక సహాయకులు, ఫీల్డు అసిస్టెంట్ల నుంచి త్వరతగతిన రికవరీ చేయాలని నిర్ణయించినట్లు తెలుస్తుంది. గతంలో దుర్వినియోగమైన నిధుల్లో కొంతభాగం రికవరి చేసి, వేరే ప్రాంతానికి బదలీ చేశారు. సామాజిక తనిఖీల్లో నిధుల స్వాహా చేయడంలో తీవ్ర ఆరోపణలు ఎదుర్కొన్న వారి నుంచి నిర్ణీత సమయంలో రికవరి చేయాలని, అలా జరగని పక్షంలో పోలీసు కేసు నమోదు చేయాలన్న ఆలోచనలో వున్నారు. ప్రధానంగా గ్రామీణ ప్రాంతాల్లో ఉపాధిహామీ సిబ్బంది పనులు కేటాయించడంలో ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారని కూలీలు చెబుతున్నారు.

నిధుల స్వాహాపై ఆరోపణలు ఎదుర్కొంటున్న సిబ్బందిని కాపాడేందుకు రాజకీయపార్టీల నేతలు ప్రయత్నాలు సాగిస్తున్నారు. మొత్తం మీద ఉపాధి హామీ పథకం నిధుల దుర్వినియోగం కాకుండా పిడి గౌతమి చర్యలకు ఉపక్రమించడం శుభపరిణామం. కూలీలకు నగదు చెల్లించకుండా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్న సీడ్ సంస్థపై కేసు ఫిర్యాదు చేసిన ఆమె నగదు చెల్లించేందుకు కృషి చేస్తున్నారు.

గత నెలరోజుల నుంచి పత్తా లేకుండాపోయిన సీడ్ సంస్థ నిర్వాహకులపై పోలీసులకు ఫిర్యాదు చేయడంతో స్పందించారు. 7వ తేది 2కోట్ల 90లక్షల రూపాయలను బ్యాంకు నుంచి డ్రా చేశారు. డ్రా చేసిన నగదును కూలీలకు చెల్లించేందుకు ఏర్పాట్లు కూడా చేశారు. భవిష్యత్‌లో మరోసారి కూలీలను ఇబ్బంది పెట్టకుండా ఉన్నతాధికారులు కఠినంగా వ్యవహరించాల్సిన అవసరం వుంది.



## కావలి ఆర్టీసి డిపోలో అధ్వాన్నపు బస్సులు!

- సీట్లు చినిగిపోయి, టైర్లు అరిగిపోయాయి!

కావలి రూరల్ ప్రాంతంలో తిరిగే ఆర్టీసి బస్సులు దుస్థితిలో వుంటున్నాయి. కిటికీలకు అద్దాలు లేక, సీట్లు చినిగిపోయి, టైర్లు అరిగిపోయి, సరిగా శుభ్రపరచక, బస్సు పైభాగం దెబ్బతిని ధ్వంసమైన బస్సులను ఈ ప్రాంతంలో నడుపుతుండడంతో ప్రయాణీకులు తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. ఆర్టీసి డిపో నుంచి జువ్వల దిన్నె, అల్లూరు తదితర ప్రాంతాల్లో తిరిగే బస్సులను ఎక్కాలంటేనే ప్రయాణీకులు హడలిపోతున్నారు. ఇక వర్షం వచ్చిందంటే బస్సంతా ఉరుపే. ఇక అరిగిపోయిన టైర్ల స్థానంలో కొత్తటైర్లు వేయకపోవడంతో తరచూ పంక్చర్లు కావడం, బస్సులు నిలచిపోవడం జరుగుతోందని ప్రయాణీకులు వాపోతున్నారు. దీనికితోడు బస్సులకు సరిపడా డీజిల్ పట్టకుండా నడుపుతుండడంతో మధ్యలోనే బస్సులు ఆగిపోతుండడంతో ప్రయాణీకులు నడిరోడ్డుపై గంటలకొద్ది నిలబడి పోవాల్సి వస్తోంది. ఈ సమస్య వాకాడు, కోట ఆర్టీసి బస్సుల్లోను ఎదురౌతోంది. ఈ బస్సుల మూలంగా అసౌకర్యమే కాక, గమ్యస్థానం చేరుతామన్న నమ్మకం లేదని ప్రయాణీకులు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు.

# ఆయనో స్నేహితుడు



నేను ఆదిత్య చోప్రాను ఎనిమిది నెలల క్రితం పెళ్లాడానా? ఎవరు చెప్పారు ఈ విషయం. అసలు ఇంత దారుణమైన అబద్ధాన్ని ఎలా సృష్టిస్తారో అర్థం కావడం లేదంటుంది హీరోయిన్ రాణీముఖర్జీ. కుచ్‌కుచ్ హోతాహై చిత్రంతో బాలీవుడ్‌లో ఘన విజయాన్ని అందుకొన్న రాణి పలు చిత్రాల్లో నటించి అగ్రనాయికగా ఎదిగింది. ఆమె నటించిన 'అయ్యా' ఇటీవలే తెరపైకి వచ్చింది. అమీర్‌ఖాన్ సరసన నటించిన తలాష్ విడుదలకు సిద్ధమవుతోంది. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమెతో ఆదిత్య చోప్రాతో మీరు రహస్య వివాహం చేసుకొన్నారటగా అంటే; సమాధానంగా అదంతా పచ్చి అబద్ధమంది. ఆయనో నిర్మాత, నాకు మంచి స్నేహితుడు అంతే. ఆయన నాకు 50 లక్షల కారు బహుమతిగా ఇచ్చాడనడం కూడా అబద్ధమే. ఎవరు ఎవరికి తోడో పైన దేవుడు ఎప్పుడో రాసేస్తాడు. ఆ జంట భూమిపైకి వచ్చే ముందు విడిపోతారు. మళ్లీ పెళ్లి అనే బంధం వాళ్లను కలుపుతుంది. ప్రస్తుతానికి తాను ఒంటరిగా ఆనందంగానే వున్నానంటోంది రాణీముఖర్జీ.

# శింబు కొత్త ఫ్రెండ్ లేఖ!



తమిళ హీరో శింబుకు ప్లేబాయ్ ముద్ర వుంది. ఆయన 'కెట్టవన్' చిత్రానికి దర్శకత్వం వహించబోతున్నారు. త్వరలో ప్రారంభమయ్యే ఈ చిత్రంలో నాయికగా లేఖ వాషింగ్టన్ అనే భామను ఎంపిక చేసుకున్నాడు. వీడియో జాకీగా పనిచేసిన అనుభవం వున్న లేఖ తెలుగు సినిమా వేదంలో నటించింది. శింబుతో లేఖ ఎంతో సన్నిహితంగా వుంటోందని చెన్నై సినీవర్గాలు కొంత కాలంగా చెబుతున్నాయి. ఆమె తమిళంలో నాలుగైదు చిత్రాలు చేసింది. లేఖ వీజేగా వున్నప్పటి నుంచే శింబుతో స్నేహం వుందట. ఆ పరిచయమ్మీదే నాయికగా అవకాశమిచ్చాడని శింబు సన్నిహితులు చెబుతున్నారు. ఇంకా సినిమా మొదలుకాకముందే ఈ జోడీ వార్తల్లో నిలిచింది.

# బాలయ్య సింహావతారం

శ్రీమన్నారాయణ చిత్రం తర్వాత మూడు నెలలుగా ముఖానికి బాలకృష్ణ మేకప్ వేసుకోలేదు. కొత్త కథలు వింటున్నా దేనికీ ఒకే చెప్పడం లేదు. మరోవైపు దర్శకుడు బోయపాటి శ్రీను పరిస్థితీ అంతే. దమ్ము తర్వాత కథ విషయంలో మరింత కసరత్తులు చేస్తున్నారు. ఆయన ఈ మధ్య ఓ కథను సిద్ధం చేసుకొన్నారు. బాలకృష్ణకు వినిపించాడు. ఆయన కూడా సానుకూలంగా స్పందించాడని ఫిల్మ్ నగర్ కథనం. అంటే బాలకృష్ణ చేత మరోసారి సింహావతారం ఎత్తించ బోతున్నారన్నమాట.

# కూతురు కోసం కవిగా మారిన కమల్‌హాసన్



కమల్‌హాసన్ బహుముఖ ప్రజ్ఞాశాలనే సంగతి ప్రత్యేకంగా గుర్తు చేయవలసినవసరం లేదు. ఈ మధ్య ఆయనలోని గీత రచయిత బయటకు వచ్చాడు. విషయం ఏమిటంటే... శృతిహాసన్ ఓ తమిళ సినిమా కోసం పాట పాడడానికి అంగీకరించింది. ఆ పాట అస్సామీ, తమిళ పదాలలో కొనసాగాలి. తమిళ పదాల కోసం శృతి తండ్రిపై ఒత్తిడి చేసింది. దీంతో ఆయన ఆ పాట వ్రాసిపడేశారు. ఈ విషయమై కమల్ మాట్లాడుతూ 12ఏళ్ల క్రితం 'హేరామ్' చిత్రంలో శృతి నా కోసం ఓ పాట పాడింది. ఇప్పుడామె కోసం పాట వ్రాసి బదులు తీర్చుకొన్నానన్నాడు.



# సన్నీలియోన్ జోరు!

సన్నీలియోన్ అంతర్జాతీయంగా పేరు సంపాదించుకున్న శృంగార తార. బిగ్‌బాస్ కార్యక్రమంలో పాల్గొనడానికి భారతదేశానికి అతిథిగా వచ్చింది. ఆమె నచ్చడంతో పూజాభట్ తన జిస్మ్-2 చిత్రంలో హీరోయిన్‌గా ఎంపిక చేసుకొంది. ఈ చిత్రం జయాపజయాలు ఎలా ఉన్నా సన్నీకి మాత్రం అవకాశాలు బాగా వస్తున్నాయి. ఇక్కడ స్థిరపడాలంటే ఇదే మంచి అవకాశంగా వచ్చిన ప్రతి చిత్రాన్ని సన్నీ ఉపయోగించుకొంటుంది. ప్రస్తుతం రాగిణి ఎంఎంఎస్2 చిత్రాన్ని ఒప్పుకొంది. త్వరలో ఆమె రామ్‌గోపాల్‌వర్మ తీసే 26/11లోనూ నటించబోతున్నట్లు తెలిసింది. ఇది ముంబై దాడుల నేపథ్యంలో తెరకెక్కే చిత్రం. వార్నింగ్ అనే సినిమాను ఆమె అంగీకరించింది. హిందీ చిత్రసీమ నుంచి ఇన్ని అవకాశాలు వస్తాయని ఊహించలేదు. నేను అంగీకరించిన ప్రతి చిత్రానికి నావంతు కష్టపడతాను. ఇక్కడ ప్రేక్షకుల అభిరుచికి తగ్గట్లు మారుతాను. అందుకే డ్యాన్స్ కూడా నేర్చుకొంటున్నానంది. పచ్చి శృంగారతారకు ఇన్ని సినిమా అవకాశాలు ఆశ్చర్యపరుస్తున్నాయి.

# వేశ్య పాత్రలో శ్రియ



తెలుగు సినిమాల్లో వేశ్య పాత్రలకు డిమాండ్ పెరిగింది. ఆ తరహా పాత్రల్లో నటించేందుకు హీరోయిన్లు ఆసక్తి చూపుతున్నారు. కొన్నేళ్ల క్రితం వచ్చిన వేదం చిత్రంలో అనుష్క ఈ రీతిన నటించి యువతకు చేరువైంది. ఇప్పుడు శ్రియ కాల్‌గాళ్‌గా కెమెరా ముందుకు రాబోతోంది. ఆమె నటించబోయే చిత్రానికి 'పవిత్ర' అనే పేరు ఖరారు చేశారు. రచయిత జనార్దన మహర్షి ఈ చిత్రానికి దర్శకుడు. పవిత్రత అనేది దేహానికా మనస్సుకా అనే అంశం ఈ కథలో ప్రధానాంశమని సమాచారం.

# బెంగాలీ చిత్రాలే పునాది!



సహజంగా ఏ భాషలో నటిస్తే ఆ భాష ఇష్టమని చెబుతుంటారు హీరోయిన్లు. కానీ విద్యాబాలన్ మాత్రం తనకు బెంగాలీ భాష అంటే అభిమానమని చెబుతోంది. కారణమడిగితే నేను కోల్‌కత్తా చాలాసార్లు వెళ్లాను. బెంగాలీ భాషలో రూపొందించిన షార్ట్ చిత్రాల్లో నటించాను. అదేంటో కోల్‌కత్తా వెళ్తే సొంత ఇంటికి వెళ్లినంత ఆనందంగా ఉంటుంది. కహాని చిత్ర విజయం సమయంలో కాళికామాతకు పూజలు చేశాను. ఈ చిత్రం చక్కటి విజయం సాధించింది. అలాగే ఇప్పుడు నేను మరికొన్ని చిత్రాల్లో నటిస్తున్నాను. అవి కూడా విజయవంతం అవుతాయని నమ్ముతున్నాను. ఎందుకో బెంగాలీ భాష నేర్చుకోవడానికి నా మనసు ఉవ్విళ్లూరుతున్నది. ఉత్తమ నటిగా జాతీయ స్థాయి అవార్డు రావడానికి ప్రధాన కారణం బెంగాలీలో షార్ట్ చిత్రాలు చేయడమే. అక్కడ నటిస్తున్నప్పుడే నటనపై పట్టు సాధించానని చెప్పుకొచ్చిందామె.

# మళయాళంలో స్మిత జీవితం



ద డర్టీ పిక్చర్ తరువాత సినిమా నేపథ్యంలో సినిమా అనే కాన్సెప్ట్‌కు గిరాకీ పెరిగింది. తారల ప్రస్థానంలోని ఎగుడుదిగుళ్లను కథావస్తువుగా ఎంచుకొంటున్నారు. ఈ మధ్య హిందీలో వచ్చిన హీరోయిన్ చిత్రం ఈ తరహాలోనిదే. ప్రస్తుతం మళయాళంలో రూపొందుతున్న 'క్లైమాక్స్' చిత్రం సిల్క్‌స్మిత జీవితం ఆధారంగా అల్లిన కథా చిత్రం. ఈ చిత్రంలో స్మితకు సన్నిహితులైన దర్శకులు, నిర్మాతలు, కొందరు నటులు, సాంకేతిక నిపుణులతో చర్చించి తీర్చిదిద్దుతున్నారు. స్మిత ఏ పరిస్థితుల్లో శృంగార చిత్రాల్లో నటించాల్సి వచ్చింది? ఆమె ఆలోచనలేమిటి? లాంటి అంశాలన్నీ ఈ చిత్రంలో స్పృశిస్తున్నారు. దీంట్లో హీరోయిన్ సనాఖాన్. గతంలో ఈమె కత్తి, మిస్టర్ నూకయ్య చిత్రాల్లో హీరోయిన్‌గా నటించింది. క్లైమాక్స్‌ను అదే పేరుతో తెలుగులోకి డబ్ చేస్తారు.

# ఎన్టీఆర్ సరసన మళ్లీ తమన్నా!

ఊసరవెల్లి చిత్రంలో హీరో ఎన్టీఆర్, హీరోయిన్ తమన్నాల మధ్య కెమిస్ట్రీ బాగా వర్కవుట్ అయ్యింది. దీంతో ఇదే జంటతో దిల్‌రాజు నిర్మాతగా కొత్త చిత్రానికి ఇటీవలే పూజాకార్యక్రమాలు జరిగాయి. ఈ చిత్రానికి గబ్బర్‌సింగ్ ఫేం హరీష్ శంకర్ దర్శకుడు. ఈ సినిమాలో మరో హీరోయిన్ కూడా ఉంటుందని ఫిల్మ్‌నగర్ కథనం.

# దొంగ హిందీ 'పండిట్ల' విచారణ ఎన్నాళ్లు!

**● రక్షించే యత్నంలో విద్యాశాఖ**

డిఎస్సీ – 2002 హిందీ పండిట్ల నియామకాల ప్రక్రియలో పలు అవకతవకలు జరిగాయని వచ్చిన ఫిర్యాదుపై విద్యాశాఖ అధికారులు చేపట్టిన విచారణ కొన 'సాగుతూనే' ఉంది. ఆ ఏడాది జరిగిన హిందీ ఉపాధ్యాయుల ఎంపికలో పలువురు బోగస్ సర్టిఫికేట్లు సమర్పించి ఉద్యోగాలు పొందారని విద్యాశాఖ దృష్టికి తీసుకొని వచ్చినా పట్టించుకోక పోవడంతో రావూరి రమేష్‌బాబు అనే వ్యక్తి జిల్లా కోర్టులో కేసు వేశారు. నకిలీ సర్టిఫికేట్లు సమర్పించారని, బోగస్ వికలాంగుల సర్టిఫికేట్లతో కొందరు ఉద్యోగాలు పొందారని, లోకల్, నాన్‌లోకల్ సర్టిఫికేట్లలోనూ, రోస్టర్ విధానంలోనూ అవకతవకలు జరిగాయని చెప్పి నాలుగు కేసులు దాఖలు చేశారు. కోర్టు మొట్టికాయలు వేయడంతో కుంభకర్ణ నిద్ర వదిలిన విద్యాశాఖ సర్టిఫికేట్ల పరిశీలన చేపట్టింది. వీరిలో 24 మంది అలహాబాద్ తదితర ప్రాంతాల్లో గల గుర్తింపులేని విశ్వవిద్యాలయాల నుంచి హిందీ పండిట్ శిక్షణ పొందినట్లు నకిలీ సర్టిఫికేట్లు సమర్పించారని రుజువైంది. విద్యాశాఖ చేపట్టిన విచారణకు పలువురు గైర్హాజరయ్యారు. దీనిపై విద్యాశాఖాధికారి మూడు బృందాలను ఏర్పాటుచేసి అలహాబాద్, హైదరాబాద్ తదితర ప్రాంతాలకు పంపించారు. వీరితోపాటు కలెక్టర్ ఆదేశాలపై విజిలెన్స్ అధికారులు విచారించగా ఆ సర్టిఫికేట్లన్నీ నకిలీవేనని తేలిందట. అయితే దీనిపై చర్యలు చేపట్టడంలో అధికారులు మీనమేషాలు లెక్కిస్తుండడం, వీరి అడ్రస్ తెలియదంలేదని చెప్పడం విద్యాశాఖను నవ్వులపాలుచేస్తోంది. పనిచేసే ఉపాధ్యాయులు ఎక్కడ ఉన్నారో తమ వద్ద వివరాలు లేవని చెప్పుడడంపై పలు విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. సర్టిఫికేట్ల పరిశీలనే ఇంతకాలం జరిగితే ఇక బోగస్ వికలాంగుల సర్టిఫికేట్లు, నాన్ లోకల్, లోకల్ అంశాలు, రోస్టర్ విధానంపై ఎప్పటికి విచారణ జరుగుతుంది, ఎప్పుడు సంబంధిత వ్యక్తులపై చర్యలు చేపడుతారనేది అంతు చిక్కని ప్రశ్నగా మారింది.




బిజెపి అధ్యక్ష పీఠానికి ఎన్నికలు సమీపిస్తుండడంతో పోటీ నెలకొనింది. ప్రస్తుత అధ్యక్షునిగా కర్నాటి ఆంజనేయరెడ్డి, ప్రధాన కార్యదర్శిగా ఉన్న మిడతల రమేష్‌లు జిల్లా అధ్యక్ష స్థానానికి పోటీ పడుతున్నారు. దీనికి సంబంధించి సంస్థాగత ఎన్నికల ప్రక్రియ ముగిసింది. గ్రామ కమిటీలు, మండల కమిటీ ఎంపికలు దాదాపు పూర్తయ్యాయి. ఒకటి రెండు మండలాలకు తప్ప అన్ని ప్రాంతాల్లో కమిటీలు పూర్తయ్యాయి. ఇక జిల్లా అధ్యక్ష ఎన్నికలే మిగిలాయి. మూడేళ్లకు ఒకసారి జరిగే ఈ ఎన్నికలలో ఈసారి ఇరువురు నేతల మధ్య పోటీ నెలకొనింది. మూడేళ్ల క్రిందట జరిగిన ఎన్నికల సమయంలో ఆంజనేయరెడ్డి, రమేష్‌లు పోటీపడినా సమర్థుడైన నాయకత్వ లక్షణాలు కల్గి ఉండడం, చక్కని ఉపన్యాస కళ, చురుకైన పనితనం తదితర కారణాలతోపాటు బిజెపి జాతీయనేత వెంకయ్యనాయుడి ఆశీస్సులతో కర్నాటి ఆంజనేయరెడ్డి చిరకాల కోరికను నెరవేర్చుకోగలిగాడు. పదవి చేపట్టిన తర్వాత జిల్లాలో స్తబ్దుగా ఉన్న బిజెపి క్యాడర్‌ను కొంతమేర ఉత్సాహపరచి ప్రజా సమస్యలపై పోరాటం చేసేలా ముందుండి నడిపించాడు. థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులకు వ్యతిరేకంగా చేపట్టిన ఆందోళనలోనూ తనవంతు పాత్ర పోషించాడు ఆంజనేయరెడ్డి. మరొకసారి అవకాశం ఇస్తే మరింతగా పార్టీని బలోపేతం చేయవచ్చునన్నది ఆయన ఆలోచన. మరోవైపు క్రితం సారే అధ్యక్ష స్థానాన్ని ఆశించి భంగపడిన మిడతల రమేష్ ప్రధాన కార్యదర్శి పదవితో సరిపెట్టుకొన్నాడు. గతంలో పెద్దలిచ్చిన హామీ మేరకు అధ్యక్ష స్థానంపై ఆశలు పెట్టుకొని ఉన్నాడు. పార్టీలో బిసి నేతగా పేరొందిన చిలుకోటి వరదయ్య ఆశీస్సులతో తనవంతు ప్రయత్నాలు చేస్తున్నట్లు సమాచారం. మరోవైపు వివిధ పార్టీలు బిసిలకు పెద్ద పీట వేస్తుండడం, తెలుగుదేశం పార్టీ జిల్లా నాయకత్వాన్ని బిసి నేతలకు అప్పజెప్పడంతో బిజెపి ఎలాంటి నిర్ణయం తీసుకొంటుందనే దానిపై తీవ్ర చర్చ జరుగుతోంది. పార్టీపరంగా బలోపేతం చేయడం, కార్యకర్తలకు అందుబాటులో ఉండడం తదితర అంశాలను పరిగణలోనికి తీసుకొంటే మిడతల కంటే కర్నాటి నాయకత్వానికే పలువురు మొగ్గు చూపుతున్నట్లు సమాచారం. చివరకు వెంకయ్య నాయుడు ఎటు మొగ్గు చూపితే వారే అధ్యక్షుడిగా ఉండబోతారు.

# ఇష్టమొచ్చినట్లు విద్యుత్ కోత!

**● సహనం చచ్చిపోయే వరకు తెగిస్తున్నారు**

జిల్లావాసులను కరెంటు కష్టాలు ఇప్పట్లో వీడేలా లేవు. పట్టణం, గ్రామం అన్న తేడా లేకుండా ఎడాపెడా విద్యుత్ కోతలు విధిస్తుండడంతో ప్రజలు అల్లాడి పోతున్నారు. దోమల బెడద, దొంగల భయం, విద్యుత్ కోతలతో హడలి పోవాల్సి వస్తోంది. విద్యుత్ శాఖ మాత్రం ఇక కరెంటు కోతలు ఉండవు... తూచ్ యదావిధిగా కరెంటు సరఫరాలో కోతలు ఉంటాయి అంటూ పొంతనలేని ప్రకటనలు జారీచేస్తూ ప్రజలను గందరగోళ పరుస్తున్నది. నగరాల్లో ఐదు గంటలు, మండలాల్లో ఆరు గంటలు, గ్రామాల్లో ఎనిమిది గంటలకు పైగా విద్యుత్ కోత విధిస్తుండడంతో మంచినీటి మొదలు విద్యుత్‌పై ఆధారపడి చేసే పనులన్నింటికీ ఆటంకాలు ఎదురౌతుండడంతో చిన్న చిన్న వ్యాపారులు, వెల్డింగ్ కార్మికులు, లేత్ వర్క్ చేసేవారికి ఉపాధి లేకుండా పోయింది. కరెంటు ఎప్పుడు వస్తుందో, ఎప్పుడు పోతుందో తెలియక పనులు లేక పస్తులుండాల్సిన పరిస్థితులు ఎదుర్కొంటున్నామని పలువురు వాపోతున్నారు. ఇక నగరంలో మంచినీటి సమస్య కారణంగా అధిక సంఖ్యాకులు క్యాన్ నీటిని కొనుగోలు చేస్తుంటారు. కరెంట్ కోతల వల్ల ఆయా ప్రాంతాల్లోని మినరల్ వాటర్ ప్లాంట్లలో మంచినీటి ప్రక్రియ సరిగా జరగడం లేదు. దీంతో చాలా మంది వ్యాపారులు నీటిని శుద్ధి చేయకుండానే క్యాన్లలో నింపి సరఫరా చేసేస్తుండడంతో నీరు వాసన వస్తున్నాయని, రంగుమారి ఉంటోందని పలువురు ఫిర్యాదు చేస్తున్నారు. విధిలేని పరిస్థితుల్లో ఆ నీటినే కొనుగోలు చేసి త్రాగాల్సిన పరిస్థితులు ఎదురౌతున్నాయి. మరోవైపు విద్యుత్ శాఖ సిబ్బంది వినియోగదారుల ఫిర్యాదులపై సరిగా స్పందించడం లేదని, కరెంటు పోయిందని ఫోన్‌చేస్తే ఫోన్ ఎత్తి సమాధానం చెప్పేవారే కరువౌతున్నారని పలువురు వాపోతున్నారు.

# అభివృద్ధి పనులు వేగవంతం చేయండి!

**మునిసిపల్ మంత్రి సూచన**



అధికారుల సమీక్షా సమావేశంలో మునిసిపల్ మంత్రి మహీధర్‌రెడ్డి.

మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలో అభివృద్ధి పనులు వేగవంతం కానున్నాయి. ఈ మేరకు మునిసిపల్ శాఖా మంత్రి మహీధర్‌రెడ్డి కార్పొరేషన్ అధికారులను ఆదేశించారు. నగరంలో సిమెంటు రోడ్ల నిర్మాణం, డ్రైనేజి కాల్వల కల్వర్టులు, విస్తరణ పనులు వేగవంతం చేయనున్నారు. త్వరలో స్థానిక సంస్థల ఎన్నికలు నిర్వహించే అవకాశం ఉండడంతో ఇప్పటికే మంజూరు కాబడిన పనులను త్వరితగతిన పూర్తిచేయాలని మంత్రి భావించినట్లున్నారు. ఇటీవల నెల్లూరు నగరానికి విచ్చేసిన మంత్రి కార్పొరేషన్ కార్యాలయంలో కమిషనర్‌తోపాటు వివిధ విభాగాల అధికారులతో సమీక్షా సమావేశం నిర్వహించి అభివృద్ధి పనులపై చర్చించడం జరిగింది. అభివృద్ధి పనులను వేగవంతం చేయడంతోపాటు పారిశుద్ధ్యం మెరుగు పరచి, దోమల నివారణకు ప్రత్యేక చర్యలు తీసుకోవాలని మంత్రి కోరారు. మంత్రి ఆదేశాలతో స్పందించిన కమిషనర్ ఇతర విభాగాల అధికారులతో కలసి నగరంలో పర్యటించి పనులను పర్యవేక్షిస్తున్నారు. ఎన్ని నిధులు ఖర్చు చేసినా దోమల బాధ నుంచి నగర ప్రజలకు విముక్తి కలిగించలేక పోతున్నారు.

# హెల్త్ సెంటర్లలో డయాలసిస్ యూనిట్!

**కిడ్నీ వ్యాధిగ్రస్తులకు శుభవార్త**

జిల్లాలో కమ్యూనిటీ హెల్త్ సెంటర్లలో త్వరలో డయాలసిస్ యూనిట్లను ఏర్పాటుచేయనున్నారు. ఈ యూనిట్లను ఏర్పాటుచేస్తే కిడ్నీ బాధితులకు ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సహకారంతో డయాలసిస్ కేంద్రాలను ఏర్పాటు చేస్తారు. ఈ మేరకు రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖ నుంచి జిల్లా అధికారులకు ఉత్తర్వులు అందాయి. కిడ్నీ బాధితులు డయాలసిస్ చేయించుకునేందుకు ఇప్పటివరకు కార్పొరేట్ ఆసుపత్రులను ఆశ్రయిస్తూ వస్తున్నారు. అక్కడ వేలాది రూపాయలు చెల్లించలేక ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటున్న వారికి త్వరలో ఊరట లభించే అవకాశం ఉంది. ప్రభుత్వం ఆధ్వర్యంలో ఏర్పాటు కాబోయే ఈ కేంద్రాల్లో ఉచితంగా డయాలసిస్ చేస్తారు. వీటి ఏర్పాటుకు జిల్లా వైద్య ఆరోగ్య శాఖ కసరత్తు ప్రారంభించింది.

# తప్పుడు పత్రాలు అందిస్తే చర్యలు

ఇక నుంచి మొబైల్ కొత్త కనెక్షన్ కోసం తప్పుడు ధృవీకరణ పత్రాలు సమర్పిస్తే అటువంటి వారిపై పోలీసు కేసు నమోదు కానుంది. ఇప్పటి వరకు కొత్త సిమ్ కొనుగోలుకు వివిధ రకాల ధృవీకరణ పత్రాలు అందిస్తే వెంటనే సిమ్‌కార్డు అందజేయడంతోపాటు యాక్టివేషన్ చేసేవారు. కొత్త నిబంధనలతో తప్పుడు ధృవీకరణ పత్రాలకు బ్రేకు పడనుంది. సిమ్ కార్డు కోసం గుర్తింపు కార్డుతో, కూడిన నివాస ధృవీకరణ పత్రం సంబంధిత సెల్ కంపెనీ ఏజెన్సీలకు అందించాల్సి ఉంటుంది. స్వీకరించిన ధృవీకరణ పత్రాలు పరిశీలించి నకిలీవా కాదా అన్నది నిర్ధారించుకోవాల్సి ఉంటుంది. నకిలీవని తేలితే వెంటనే పోలీసులకు ఫిర్యాదు చేయవచ్చు. అలా కాకుండా సిమ్ కార్డులను అందించి యాక్టివేషన్ చేసిన తర్వాత సంబంధిత కంపెనీలు మళ్లీ పరిశీలన చేస్తాయి. కంపెనీల విచారణలో వాస్తవం లేదని తేలితే ఏజెన్సీలపై ఫిర్యాదు చేసేందుకు కొత్త చట్టం ఏర్పడింది. మొబైల్ కనెక్షన్‌కు నకిలీ పత్రాలు అందించి అసాంఘిక కార్యకలాపాలకు పాల్పడుతుండడంతో కేంద్ర ప్రభుత్వం నిబంధనలను కఠినతరం చేసింది. అవసరమైతే వినియోగదారుడు సమర్పించిన ధృవీకరణ పత్రాల్లో చూపిన చిరునామాపై కూడా విచారణ జరుపుతారు. నగరంలో అన్ని సెల్ కంపెనీల ఏజెన్సీలకు ఈ కొత్త నిబంధనలు అందనున్నాయి.

## కాంగ్రెస్ తెప్పను ముంచిన మజ్లిస్!

9వ పేజీ కొరవ

మసబ్ ట్యాంక్ సమీపంలో, కొన్ని వందల కోట్ల రూపాయలు విలువ చేసే మహవీర్ ఆస్పత్రి స్థలం మీద మజ్లిస్ నేతలకు చాలాకాలం నుంచి కన్ను వుంది. 1977లో జలగం వెంగళరావు ముఖ్య మంత్రిగా వున్నప్పుడు ఇక్కడ మూడెకరాల స్థలాన్ని మహవీర్ ట్రస్ట్‌కు లీజు ప్రాతిపదికన ఇచ్చింది ప్రభుత్వం. అప్పటి నుంచి దానిలో వారు మహవీర్ ఆస్పత్రి నిర్వహిస్తున్నారు. పదేళ్ల క్రితం వరకు హైదరాబాదులో మంచి ఆస్పత్రి అంటే, అదే. కొన్ని వేల మంది పేదలకు ఆరోగ్యం అందించిన ఆస్పత్రి అది. దాని భూమికి ఇచ్చిన లీజు 2007లో ముగిసి పోయింది. దాన్ని పునరుద్ధరించమని వారు దరఖాస్తు చేశారు. అయితే పక్కనే వున్న నీలోఫర్ పిల్లల ఆస్పత్రి డాక్టర్లు ఈ స్థలాన్ని తమకు ఇవ్వమని ప్రభుత్వాన్ని కోరారు. హైదరాబాద్ కలెక్టర్, జిహెచ్ఎంసి అధికారులు కూడా ఈ స్థలం తమకివ్వాలని కోరి వున్నారు.

మజ్లిస్ నేత ఒవైసీకి రెండు ఆస్పత్రులు, మెడికల్ కాలేజీ వున్నాయి. పాతబస్తీలో, 1125 పడకల భారీ ఆస్పత్రిని నడుపుతున్నారు వారు. ఆ ఆస్పత్రిని విస్తరించి, మెడికల్ కాలేజీ సీట్ల సంఖ్యను 250కి పెంచుకోవడానికి తమకు ఈ స్థలం కావాలన్నది ఒవైసీ కోరిక. అయితే ప్రభుత్వ నిర్వహణలో, లక్షలాది మంది నిరుపేదల పిల్లలకు ప్రాణం పోస్తున్న నీలోఫర్‌ను కాదని, ఒవైసీ ప్రైవేటు వ్యాపారానికి ప్రభుత్వ స్థలం ఎందుకివ్వాలని అధికారులు అడ్డం తిరిగారు. దానితో కిరణ్‌కుమార్ రెడ్డి ఒవైసీ కోరిక తీర్చలేకపోయాడు. కిరణ్ మీద ఒవైసీ కోపానికి ప్రధాన కారణం అదే.

పాతబస్తీలో ఎంత పలుకుబడి వున్నా, రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల ముస్లింలకు మాత్రం మజ్లిస్ పార్టీ మీద మొదటి నుంచీ మక్కువ లేదు. ఒవైసీ కుటుంబం మత చాందసత్వాన్ని రెచ్చగొట్టి పదవులు అనుభవిస్తున్నదన్న చులకన భావన సాధారణ ముస్లింలలో వుంది. అందువల్లనే తమ పార్టీని విస్తరించుకోవడానికి గతంలో వారెన్ని ప్రయత్నాలు చేసినా ఫలించలేదు. ముస్లిం ఓటర్లు అధికంగా వున్న స్థానాలలో పోటీ చేసినా డిపాజిట్లు కోల్పోయింది మజ్లిస్‌పార్టీ. ఈ నేపథ్యంలో జగన్‌లో వారికి కొత్త వెలుగు కన్పించింది. రాష్ట్రంలో జగన్‌కు వున్న ప్రాబల్యాన్ని తమ పార్టీ విస్తరణకు వాడుకోవచ్చునన్న ఆశ పుట్టింది. ముస్లింలు అధికంగా వుండే కడప, కర్నూలు, నిజామాబాద్, కరీంనగర్ వంటి జిల్లాలలో తమకు కొన్ని సీట్లు కేటాయించమనే ప్రతిపాదన పెట్టారు జగన్ ముందు. అందుకు జగన్ కూడా సానుకూలంగా స్పందించాడట. ఆయనకు ఇప్పటికిప్పుడు మజ్లిస్‌తో అవసరం వుంది. ఎన్నికల సమయంలో సీట్ల బేరాల సంగతి చూసుకోవచ్చుననే ఆలోచనతో సరే అన్నాడట. జగన్ అధికారంలోకి వస్తే మహవీర్ ఆస్పత్రి స్థలం ఎటూ తమకే దక్కుతుంది కాబట్టి, 40 సీట్లు మూడెకరాల నేల నినాదంతో కాంగ్రెస్ తెప్పను వాగు మధ్యలో ముంచడానికి సిద్ధపడ్డాడు ఒవైసీ. అందువల్లనే ఆయన కిరణ్ మీద విమర్శల వర్షం కురిపించాడు తప్ప కాంగ్రెస్‌ను తిట్టలేదు.

అయితే ఇంతకాలం తమను అంటిపెట్టుకొని వుండి, ఎన్నో లాభాలు అనుభవించి, ఎన్నికల సమయంలో పుట్టి ముంచి పోతున్న మజ్లిస్ పట్ల కాంగ్రెస్ అధిష్టానం తీవ్ర ఆగ్రహంతో వుంది. పోతూ పోతూ కాంగ్రెస్ మత తత్వ పార్టీ అనే నింద వేసి పోవడం వారిని మరింత ఆశ్చర్యానికి గురి చేసింది. దానివల్ల ఒక్క ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాకుండా దేశంలోని ఇతర ప్రాంతాలలో కూడా ముస్లింలు ప్రభావితమౌతారనే భయం వుంది కాంగ్రెస్ పెద్దలలో. అందువల్ల ఈ నష్ట నివారణకు సత్వర చర్యలు చేపడుతున్నారు.

ఏదిఏమైనా ఒవైసీ సోదరులు తమ స్వార్థం కోసం రాష్ట్ర రాజకీయాలలో ఒక అవాంఛనీయమైన మత ప్రాతిపదికను ప్రేరేపిస్తున్నారు. ఇది రాష్ట్రానికి ఏ విధంగానూ మంచి చేయదు.

## కనుపర్తిపాడు చెరువు

16వ పేజీ కొరవ

నిజానికి పట్టా షరతులను పక్కన పెట్టినా, ఆ భూమి చెరువు పోరంబోకు అని గ్రామ రెవెన్యూ రికార్డులలో వందేళ్లుగా నమోదై వుంది. సుప్రీం కోర్టు తీర్పు ప్రకారం చెరువు భూములను ఏ అవసరం కోసం కూడా తాకడానికి లేదు. ప్రభుత్వానికి కూడా ఆ అధికారం లేదు. దాని ప్రకారం చూసినా ఈ భూమి ఎమ్మెల్యే గారికి చెందే అవకాశం లేదు.

మొత్తానికి వంద కోట్ల రూపాయల విలువైన భూమి అన్యాక్రాంతం కాకుండా కాపాడడంలో ప్రశంసనీయమైన తెగువ, నిర్మొగమాటం ప్రదర్శించిన కలెక్టర్‌గారిని అభినందించాలి. ఆయన చూపిన మార్గం రెవెన్యూ అధికారులందరికీ మార్గదర్శకంగా ఉపయోగపడితే నెల్లూరు నగరంలోనూ క్యాన్సర్ రోగం వలె ఆశించి వున్న ఆనం సోదరుల అక్రమాలకు కొంతైనా తెర పడుతుంది.

## జనవాణి

2వ పేజీ కొరవ

చిరంజీవికి రాష్ట్రంలో లక్షలాది మంది అభిమానులున్నారు. బ్లడ్‌బ్యాంక్, ఐబ్యాంక్ ద్వార చిరంజీవి రాజకీయాల్లోకి రాకముందే సేవలందించారు. ఆయన అనుకొంటే ఏదైనా చేయగల సమర్థుడు. పర్యాటక మంత్రిగా రాష్ట్రానికి, నెల్లూరుజిల్లాకు వీలైనంతగా మంచి చేయాలని దీనికిగాను ఆయనకు భగవంతుడు శక్తి నివ్వాలని కోరుకొంటున్నాను.

కె.హరినాధరావు చెన్నై

### సుబ్బరామిరెడ్డిని మరవడం బాధాకరం!

ఇటీవల జరిపిన కేంద్రమంత్రివర్గ విస్తరణలో రాజ్యసభ సభ్యులు తిక్కవరపు సుబ్బరామిరెడ్డికి అవకాశం కల్పించకపోవడం బాధాకరం. పారిశ్రామిక, ఆధ్యాత్మిక సేవారంగాల్లో ఎంతో సేవ చేసిన వ్యక్తి సుబ్బరామిరెడ్డి. విశాఖ ఎమ్పీగా, రాజ్యసభ సభ్యుడిగా, టిటిడి ఛైర్మన్‌గా, వివిధ పార్లమెంటు స్టాండింగ్ కమిటీల అధ్యక్షునిగా సమర్థవంతంగా పని చేశారు. పార్టీ అధికారంలో లేనికాలంలో జాతీయస్థాయిలో మీడియా విభాగం సమన్వయకర్తగా పని చేసి పార్టీ తిరిగి గెలిచేలా చేశారు. మొన్న నెల్లూరు పార్లమెంటు స్థానానికి జరిగిన ఉపఎన్నికల్లో పోటీ చేయను పార్టీలో ఎవరూ ముందుకు రాకుంటే సోనియా గాంధీ ఆజ్ఞ మేరకు పోటీ చేసి కాంగ్రెస్ పరువు నిలబెట్టారు. అటువంటి వ్యక్తికి మంత్రిపదవి ఇవ్వకపోవడం ఆయన అభిమానులను బాధపెడుతుంది.

ఎస్.బాబురావు కావలి



విద్యానగర్ ఎన్‌బికెఆర్ కాలేజీలో తెల్లకామెర్ల వ్యాధితో బాధపడుతున్న బిటెక్ విద్యార్థిని ఎస్తేరు ప్రీతికి వైద్య ఖర్చుల నిమిత్తం 50వేల రూపాయలను డిఇఒ రామలింగం ద్వారా అందిస్తున్న డాక్టర్ కిషోర్ జెన్ నెక్స్ట్ స్కూల్ అధినేతలు కృష్ణకిషోర్, వాసంతి.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

హోమం మూలంగానైనా ధమరుకం ఈ వారమైనా మోగుతుందని ఆశిద్దాం.

### ఎసి స్టేడియంలో అవగాహన సదస్సు!

ఎసి స్టేడియం వాకర్స్ అసోసియేషన్ నేతృత్వంలో ఎసి స్టేడియంలో 11వ తేది వాకర్స్‌కు కంటి వైద్యుడు డాక్టర్ ఎవిఎస్ కృష్ణప్రసాద్ గ్లకోమా వ్యాధిపై అవగాహన కల్గించారు. ఈ వ్యాధి ప్రమాదకరమైనదని జాగ్రత్తగా ఉండాలని ఆయన సూచించారు. 40ఏళ్లు పైబడిన వారు విధిగా కంటి డాక్టర్ దగ్గర పరీక్షలు చేయించుకోవాలన్నారు. ఈ కార్యక్రమంలో సంఘం అధ్యక్ష, కార్యదర్శులు ఎన్.రాఘవేంద్రశెట్టి, బలరామయ్య నాయుడు పాల్గొన్నారు.

### ఉచిత కంటి వైద్య శిబిరం

నెల్లూరు పొగతోటలోని మాదరన్ రెటినా సెంటర్‌లో షుగర్ వ్యాధితో బాధపడే వారి కోసం డయాబెటిక్ రెటినోపతి పరీక్షా శిబిరాన్ని ఈ నెల 10వ తేది నుంచి 20వ తేది వరకు నిర్వహిస్తారు. మధ్యాహ్నం ఒంటి గంట నుంచి ఐదు గంటల వరకు ఈ ఉచిత పరీక్షలు కొనసాగుతాయి. ఆరోగ్యశ్రీ కార్డు, తెల్లరేషన్ కార్డు, రచ్చబండ కార్డు ఉన్న వారికి రెటినా లేజర్ ఆపరేషన్లు ఉచితంగా చేస్తారు. వివరాలకు 0861 – 2354433, 2354455 ఫోను నెంబర్లలో సంప్రదించమంటున్నారు మాదరన్ గ్రూపు ఐ హాస్పిటల్స్ ఛైర్మన్ డాక్టర్ పి.ఎల్.రావు.

### పోలీస్ అధికారులకు అవార్డు

వెంకటగిరిలో జంతు బలుల ప్రచారాన్ని గట్టిగా నిర్వహించినందుకు గతంలో జిల్లా ఎస్పీగా పనిచేసిన దామోదర్, ప్రస్తుత ఎస్పీ రమణ కుమార్‌కు హైదరాబాద్‌కు చెందిన స్వచ్ఛంద సంస్థ ఫెడరేషన్ ఆఫ్ ఎనిమల్స్ ప్రొజెక్ట్ హ్యూమన్ ఎక్స్‌లెన్సీ అవార్డును వీరివురికి ప్రకటించింది. జంతు బలుల స్థానంలో గుమ్మడికాయలు కొట్టేలా భక్తులను చైతన్యపరచడంతోపాటు పలు కార్యక్రమాలు నిర్వహించడంపై ఈ అధికారులను ప్రశంసించారు.

### కిటకిటలాడిన రోడ్లు

దీపావళి పండుగ సందర్భంగా టపాసులు, బట్టలు కొనుగోలు చేసేందుకు వచ్చే వారితో నగరంలో రోడ్లు కిటకిటలాడాయి. అధికారులు విఆర్ కళాశాల మైదానం, వైఎంసిఎ గ్రౌండ్స్, ఆర్ఎస్ఆర్ స్కూలు వద్ద మాత్రమే టపాసుల అంగళ్ల ఏర్పాటుకు అనుమతి ఇవ్వడంతో అక్కడే వ్యాపారులు స్టాల్స్ ఏర్పాటు చేసుకొన్నారు. దీంతో కొనుగోలుదారులు ఆయా ప్రాంతాలకు రావడంతో రోడ్లు కిటకిటలాడాయి. ట్రాఫిక్ స్తంభించిపోయి నడవాలంటేనే కష్టంగా మారింది.

### రిటైర్డ్ ఇంజనీర్ మరణం

నెల్లూరు బట్వాడిపాళెం వాసి, ఇరిగేషన్ శాఖ సూపరింటెండెంట్ ఇంజనీర్‌గా మంచిపేరు తెచ్చుకొన్న కసుకుర్తి రామయ్య (73) 4తేది మరణించారు. ఆయనకు భార్య, ఐదుగురు కుమార్తెలున్నారు. కుటుంబ పెద్దను కోల్పోయిన వారి కుటుంబానికి మా సానుభూతి.

## శ్యాం మరణం!

9వ పేజీ కొరవ

ధించిన భూవివాదాలపై దర్యాప్తు చేస్తున్నప్పుడు శ్యాం పేరు బయటకు వచ్చింది. సిబిసిఐడి పోలీసులు ఆయన్ను ఒకటి రెండుసార్లు విచారించారు కూడా. వారడిగిన ప్రకారం సాక్ష్యం చెప్పడానికి శ్యాం సిద్ధపడడంతో మొన్న హైదరాబాదుకు తీసుకవెళ్లారు.

అయితే శ్యాంకు చాలాకాలం నుంచే గుండె జబ్బు వుందట. ఒత్తిడి, ఆందోళనలకు దూరంగా వుండమని డాక్టర్లు సలహా కూడా ఇచ్చారట. కానీ ఈ భూమి గొడవలో పడి ఆ జబ్బును నిర్లక్ష్యం చేశాడు. సరిగ్గా సిబిసిఐడి అధికారులు సాక్ష్యం నమోదు చేస్తున్న సమయంలో తీవ్రమైన గుండె నొప్పి వచ్చింది. అప్పటికప్పుడు పోలీసులు అతడిని స్టార్ ఆస్పత్రికి తరలించి, అత్యవసర ప్రాతిపదికన బైపాస్ సర్జరీ చేయించడానికి ప్రయత్నం చేశారు. కానీ అప్పటికే శ్యాం ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి.

అక్రమ ఆర్జన మీద వ్యామోహం, అక్రమ ఆస్తుల పట్ల దురాశ మనిషిని ఎక్కడకు నడిపిస్తాయో, ఆ ప్రయాణంలో తుది గమ్యం ఎట్లా వుంటుందో అర్థం చేసుకోవడానికి శ్యాం జీవితం ఒక ఉదాహరణ.

## పదరంగం -42

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | | 4 | | | 5 | 6 | |
| 7 | | | 8 | | | | | 9 | | 10 |
| 11 | | | | | | | 12 | | | |
| | | 13 | | | | | | | 14 | |
| | 15 | | | | 16 | 17 | | 18 | | |
| 19 | | | | 20 | | | | 21 | | |
| 22 | | | 23 | | | 24 | 25 | | | |
| | | 26 | | | | 27 | | | | 28 |
| 29 | | | | 30 | | | | 31 | 32 | |
| | | | 33 | | 34 | | 35 | | | |
| 36 | | | | 37 | | | | | 38 | |

**అడ్డం**

1. ఆవిర్భవించడం (4)
4. ఎం.ఎఫ్.హుస్సేన్, మాధురి దీక్షిత్‌ల సినిమా (5)
7. నీటి మధ్య ప్రదేశం (2)
8. యమున్ని దిక్కు (3)
9. ఒక చర్మ వాయిద్యాలు (3)
11. శక్తి (2)
12. క్రాబ్ (2)
14. తలగుడ్డ అటునుంచి (2)
15. కన్ను (3)
16. గానుగ ఆడిన తర్వాత మిగిలిన పిప్పి (5)
19. స్త్రీ (3)
21. భీముని ఆయుధం, బహువచనం (3)
22. కాయకూరలు (3)
23. సరస్వతి, వాక్కు (2)
24. కళలు తడబడ్డాయి (3)
26. స్టేలు (2)
27. పురుషార్థములలో మూడవది (2)
29. మడేలన్న (3)
31. నీట పుట్టినది (3)
33. అటునుంచి పేడ (3)
35. దేవత (3)
36. రంగుల సంబరం (3)
37. వాంఛలు (4)
38. అటునుంచి పొలం (2)

**నిలువు**

1. తోడు (4)
2. చెదిరి పోవడం (3)
3. నమస్కారం (3)
4. సమూహం (2)
5. గ్రాస్‌హాపర్ (3)
6. అగ్నికణం (2)
10. చాలామంచి చిన్న అమ్మాయిలు (3)
12. మృతకళేబరం (3)
13. వంచన (3)
14. గార్ధభం (3)
15. వ్రేలాడేది (3)
17. త్రాడుతో అల్లిన మంచం (5)
18. నల తరువాతి తెలుగు సంవత్సరం (3)
19. ఇల్లు, నివాసం (2)
20. పాము (2)
23. మాటు (2)
25. క్రింద నుంచి లెగ్ (2)
26. వడ్రంగి పని ముట్టు (2)
28. వెలుగు (2)
30. క్రిందనుంచి వైశ్యుడు (3)
31. వంగిన ప్రదేశం (2)
32. శత్రువులు (3)
34. స్త్రీ (2)
35. ఫింగర్ (2)

**సమాధానాలు**

## పదరంగం -41

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 జా | 2 గృ | త | 3 ము | | 4 ని | 5 వా | ర | 6 ణ | | 7 ప్రా |
| | హ | | 8 ద | ని | యా | లు | | 9 వీ | 10 క్ష | ణం |
| 11 కు | ము | 12 ద | ము | | 13 మ | గ | | | ణి | |
| త్తు | | శ | | 14 చం | కం | | 15 త | 16 మ | కం | 17 తో |
| 18 క | 19 లి | మి | | చ | | 20 ము | ప్ప | ది | | ర |
| | ష్ట | | 21 చ | లం | | స | | | 22 ర | ణం |
| 23 వ | కా | 24 ల | తు | | 25 వా | లం | | 26 యు | క్తం | |
| 27 అ | లం | క | ర | ణ | | | 28 నా | వ | | 29 వి |
| కా | | | త | | 30 తి | రో | గ | తి | | ఘా |
| 31 శ | ల | 32 భం | | 33 వే | రు | | రా | | 34 సీ | త |
| ము | | గు | | | 35 మా | రా | జు | | 36 సా | ము |

# సంక్షిప్త సింహపురి

## కిరణ్‌కుమార్‌రెడ్డి చేసిన మేలు!

సిఎం కిరణ్‌కుమార్‌రెడ్డి నెల్లూరు మెట్టప్రాంత రైతులకు గొప్ప మేలు చేశాడు. సోమశిల హైలెవల్ కెనాల్ నిర్మాణానికి 785 కోట్ల రూపాయలు మంజూరు చేస్తూ ఇటీవల ఉత్తర్వులిప్పించారాయన. గత ఏడాది కౌలు రైతులకు హామీ పత్రాలు ఇచ్చేందుకు నెల్లూరు వచ్చిన ముఖ్యమంత్రి విఆర్ కాలేజిలో నిర్వహించిన బహిరంగ సభలో సోమశిల హైలెవల్ కెనాల్‌కు నిధులు మంజూరు చేస్తానని హామీ ఇచ్చారు. దీన్ని నెరవేరుస్తూ ఈ జిఓను జారీ చేశారు. దీనిమూలంగా ఆత్మకూరు, ఉదయగిరి నియోజకవర్గాల్లోని అనంతసాగరం, మర్రిపాడు, దుత్తలూరు, వింజమూరు, ఆత్మకూరు, ఉదయగిరి మండలాల్లోని ప్రజలకు మేలు చేకూరింది. ఈ మండలాల్లో 59 కిలో మీటర్ల పొడవున కాలువ తవ్వుతారు. సోమశిల ఉత్తర కాలువ నుంచి ఏడు టిఎంసిల నీటిని ఎత్తిపోతల పథకం ద్వారా ఈ కాల్వలో వదులుతారు. దీని మూలంగా 78వేల ఎకరాల కొత్త ఆయకట్టుకు, 12వేల ఎకరాల్లో చెరువుల ద్వారా స్థిరీకరించిన ఆయకట్టుకు సాగునీరు అందుతుంది. ఆరు మండలాలకు రెండు టిఎంసిల తాగునీరు కూడా కేటాయిస్తారు. ఎన్నాళ్లుగానో నలుగుతున్న ఈ పథకానికి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చేలా సిఎంను ఒప్పించడంలో ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి కూడా చక్రం తిప్పాడు.

## పనబాకకు పదోన్నతిపై హర్షం!

కేంద్ర మంత్రి మండలిలో జౌళి శాఖ నిర్వహిస్తుండిన నెల్లూరు కోడలు పనబాక లక్ష్మికి పెట్రోలియం శాఖ మంత్రిగా ప్రమోషన్ కల్పించడాన్ని ఆంధ్రప్రదేశ్ దళిత మహిళా సేన జిల్లా అధ్యక్షురాలు అరవ సుజిత ఒక ప్రకటనలో హర్షం వ్యక్తం చేసింది. ఈ పదవిని పనబాక లక్ష్మికి ఇచ్చిన యుపిఏ ఛైర్‌పర్సన్ సోనియాగాంధీ, ప్రధాని మన్మోహన్‌సింగ్‌కు కృతజ్ఞతలు తెలియజేసిందావిడ.

## నీలం బాధితులను ఆదుకోవాలి!



నీలం తుఫాన్ బాధితులను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తక్షణం ఆదుకోవాలని బిజెపి జాతీయ నాయకుడు ఎం.వెంకయ్యనాయుడు డిమాండ్ చేశారు. నెల్లూరులో ఆయన ఈ విషయమై విలేకరులతో మాట్లాడారు. నీలం తుఫాను నష్టంపై అంచనా వేసేందుకు జాతీయస్థాయి అధికారుల బృందం వెంటనే రాష్ట్రానికి రావాలి. పరిహారం విడుదల చేయడానికి ముందుగా వరద బాధిత ప్రాంతాల్లో ప్రధాని మన్మోహన్ సింగ్, యుపిఏ ఛైర్‌పర్సన్ సోనియాగాంధీ పర్యటించాలన్నారు. ముఖ్యమంత్రులు నరేంద్ర మోడి, హుడా కమిటీ సిఫార్సు చేసిన విధంగా ప్రకృతి విపత్తుల్లో పంటలు నష్టపోయిన రైతులకు ఎకరాకు కనీసం పది వేల రూపాయల వరకు నష్టపరిహారం చెల్లించాలన్నారు. రాష్ట్రంలో నీలం తుఫాను కారణంగా 15 లక్షల ఎకరాల్లో పంట నష్టం జరిగిందన్నారు. 2007 నుంచి 2012 సంవత్సరం వరకు ప్రకృతి వైపరీత్యాల మూలంగా రాష్ట్రానికి 22వేల కోట్ల రూపాయలకు పైగా నష్టం వాటిల్లినా కేంద్రం విదిలింపులు వందల కోట్లేనని విమర్శించారు.

## నెల్లూరు నుంచి ప్రత్యేక బస్సులు



కార్తీకమాసం సందర్భంగా రాష్ట్రంలోని పంచారామ క్షేత్రాలైన ద్రాక్షారామం, అమరారామం, క్షీరారామం, భీమేశ్వరం, కుమారరామం క్షేత్రాలకు ఆర్టీసి ప్రత్యేక బస్సులు నడుపుతుందని నెల్లూరు ఒకటో డిపో మేనేజర్ ఒక ప్రకటనలో స్పష్టం చేశారు. ఈ నెల 18, 22, 29 తేదీల్లో నెల్లూరు మెయిన్ ఆర్టీసి బస్టాండ్ నుంచి రాత్రి తొమ్మిది గంటల సమయంలో ఈ ప్రత్యేక బస్సులు బయలు దేరుతాయన్నారు. పెద్దలకు 1500 రూపాయలు, పిల్లలకు 1150 రూపాయలు చెల్లించి అడ్వాన్స్ బుకింగ్‌లో టిక్కెట్లు పొంద వచ్చన్నారు. ఈ పంచారామ క్షేత్రాల టిక్కెట్లను జిల్లాలోని అన్ని డిపోల రిజర్వేషన్ కౌంటర్లలో పొందవచ్చని స్పష్టం చేశారు. నెల్లూరు ఆర్టీసిని శబరిమలైతోపాటు ప్రత్యేక సందర్భాలలో వేస్తున్న బస్సులే నష్టాల నుంచి గట్టెక్కి స్తున్నాయి.

## మూలస్థానేశ్వరాలయంలో కార్తీక మాసం!

నెల్లూరు మూలపేటలోని భువనేశ్వరి సమేత మూలస్థానేశ్వర స్వామి ఆలయంలో కార్తీక మాసాన్ని పురస్కరించుకొని నవంబర్ 14వ తేది నుండి డిశంబర్ 11వ తేది వరకు ప్రత్యేక పూజా పునస్కారాలు జరుగుతాయి. ఈ సందర్భంగా నవంబర్ 18వ తేది నోముల ఉత్సవం, 19వ తేది కోటి సోమవారాన్ని పురస్కరించుకొని ఆలయ ప్రదక్షణోత్సవం ఉంటాయి. 26వ తేది రెండవ సోమవారం సందర్భంగా ఆలయ ప్రదక్షణోత్సవం, 28వ తేది కార్తీక పౌర్ణమిని పురస్కరించుకొని కార్తీక దీపం, చంద్ర దర్శనం, మధ్యాహ్నం అన్నదాన కార్యక్రమముంటుంది. డిశంబర్ 1వ తేది స్వామి వారి జన్మనక్షత్రం ఆరుద్రను పురస్కరించుకొని ప్రత్యేక పూజలు, 3వ తేది ఆలయ ప్రదక్షణ, 9వ తేది స్వామి అన్నాభిషేక దర్శనం, 10వ తేది ఆలయ ప్రదక్షణోత్సవం, 12వ తేది కార్తీకమాస శివరాత్రి పూజలు జరుగుతాయి. కార్తీక మాసాన్ని పురస్కరించుకొని భక్తులు పాలాభిషేకం, ఆకాశ దీపాలు, మహన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకం, రుద్రహోమం వంటి పూజల్లోనూ పాలుపంచుకోవచ్చని ఆలయ కార్యనిర్వహణాధికారి కె.జనార్దన్ రెడ్డి తెలియజేస్తున్నారు.



రైతు లోకం

# నిమ్మలో చీడపీడలు - నివారణ!

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

ప్రస్తుత వాతావరణ పరిస్థితులలో నిమ్మలో ఆకుముడత మరియు గజ్జి తెగులు ఎక్కువగా ఆశించి వున్నవి. వీటి నివారణకు ఈ క్రింది చర్యలు చేపట్టవలెను.

**ఆకుముడత:**

నర్సరీ దశ నుంచి పెద్ద చెట్ల దశ వరకు, వర్షాకాలం మరియు శీతాకాలంలో లేత చిగుళ్లపై ఎక్కువగా ఆశిస్తుంది. ఆశించిన ఆకుపై తెల్లటి పొర వంకరటింకరగా ఏర్పడి, ఆకు ముడతలు పడి గజ్జి తెగులు ఎక్కువగా ఆశించి ఆకులు ఎక్కువగా రాలిపోతాయి. దీని నివారణకు మోనోక్రోటోఫాస్ 1.6మిల్లీలీటర్లు లేదా ఇమిడాక్లోప్రిడ్ 0.5మిల్లీలీటర్లు లీటరు నీటికి చొప్పున కలిపి లేత చిగుళ్ల దశలోనే 10 రోజుల వ్యవధిలో రెండుసార్లు పిచికారీ చేయాలి. సాధారణంగా నిమ్మలో ఆకుముడత పురుగు జూన్ - జూలై, సెప్టెంబర్ - అక్టోబర్ మరియు డిసెంబర్ - జనవరి నెలల్లో ఎక్కువగా ఆశించి నష్టం కలుగజేస్తుంది. కావున దీని నివారణకు పురుగు మందులను పురుగు ఆశించే నెలలో పిచికారీ చేసుకోవాలి.

**గజ్జి తెగులు (కాంకర్ మచ్చ) :**

లేత ఆకులపై, చిన్న కొమ్మలపై, కాయల మీద, ముళ్లమీద, పెద్ద కొమ్మలమీద, కాండం మీద చివరకు ఒక్కొక్కసారి వేరుపైన ఈ మచ్చలు సోకి నష్టం కలిగిస్తాయి. తెగులు ముదిరిన దశలో చెట్లు ఎండిపోతాయి. తెగులు సోకిన చెట్లపై ఎండుపుల్ల ఎక్కువగా కన్పిస్తుంది. దీని నివారణకు గజ్జిని తట్టుకొనే "బాలాజీ" నిమ్మ రకం నాటుకోవాలి. తెగులు సోకిన కొమ్మలు కత్తిరించి స్ట్రెప్టోసైక్లిన్ 1 గ్రాము మరియు కాపర్ ఆక్సీక్లోరైడ్ 30 గ్రాములు, 10 లీటర్ల నీటికి చొప్పున కలిపి 20 రోజుల వ్యవధిలో, వర్షాకాలంలో 2 -3 సార్లు పిచికారీ చేయాలి. చెట్ల మొదళ్లపైన, పెద్ద కొమ్మలపైన గజ్జి తెగులు వుంటే, తెగులు వున్న బెరడును కత్తితో గోకి బోర్డోపేస్ట్ పూయాలి.



Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14



### భూబకాసురుల చేతి నుంచి

# కనుపర్తిపాడు చెరువును కాపాడిన కలెక్టర్!

## అది ప్రభుత్వ భూమని, దాన్ని స్వాధీనం చేసుకోమని ఆర్డీఓకు ఆదేశాలు జారీ.

నెల్లూరు నగర శివార్లలో, ప్రధాన బైపాస్ రోడ్డు ఆనుకొని వున్న కనుపర్తిపాడు చెరువు భూమి భూ బకాసురుల స్వాహా కాకుండా నిరోధించడంలో జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి అసాధారణ తెగువ, నిక్కచ్చి ధోరణి, నిజాయితీ ప్రదర్శించారు. అధికారులంటే, అధికారంలో వున్నవారి కాళ్లు కడిగి నెత్తిన నీళ్లు చల్లుకొనేవారు మాత్రమే అనే నిస్పృహలో వున్న నెల్లూరు ప్రజానీకానికి ఎనలేని మనోధైర్యం, వూరట కల్గించే నిర్ణయం తీసుకొన్నాడు.

గొలగమూడికి వెళ్లే రోడ్డును ఆనుకొని, ప్రియదర్శిని ఇంజనీరింగ్ కాలేజీకి ముందు భాగంలో, జాతీయ రహదారిని ఆనుకొని వుండి కనుపర్తిపాడు చెరువు. దాదాపు 27 ఎకరాల విస్తీర్ణం. అక్కడి భూముల ధరను బట్టి చూస్తే కనీసం వంద కోట్ల రూపాయల విలువ కల్గినది. దీనిపై నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి కన్ను పడింది. కె.బాలచంద్రారెడ్డి అనే రియల్ ఎస్టేట్ వ్యాపారిని రంగంలోకి దించి, దాన్ని ఆక్రమించారు. అదంతా పట్టా పొలమైనట్లు, ఎవరి నుంచో తాము కొనుగోలు చేసినట్లు తప్పుడు పత్రాలు సృష్టించారు. రాత్రికి రాత్రి భూమి మీద సున్నంతో గీతలు పెట్టి, రంగుల జెండాలు పాతి, ప్లాట్లుగా అమ్మకాలు మొదలు పెట్టేశారు. ఈ అక్రమంపై నగరంలో పెద్ద ఎత్తున అలజడి రేగింది. వైఎస్ఆర్ కాంగ్రెస్ నాయకుడు ఆనం వెంకటరమణారెడ్డి ఆ స్థలం వద్దకు వెళ్లి, ఆగం చేశాడు. ప్రభుత్వ భూములను ఆక్రమించి అమ్ముకొంటున్నారని ఆందోళనకు దిగాడు. దానితో ఆర్డీఓ, ఎమ్మార్వో వంటి అధికారులు ఆ స్థలం వద్దకు వచ్చి అది చెరువు భూమి అని బహిరంగంగా ప్రకటించి, దాన్ని ఎవరూ ఆక్రమించకూడదని ఒక బోర్డు పెట్టి వెళ్లారు.

హెచ్చరికతో దారికి తెచ్చాడు

తన కాలి క్రింద చెప్పుల వలె పడి వుండాల్సిన రెవెన్యూ అధికారులు, తాను ఆక్రమించుకొన్న భూమిని అడ్డుకొంటారా అని ఎమ్మెల్యేగారికి ఆగ్రహం తన్నుక వచ్చింది. ఆర్డీఓ మీద విరుచుకపడ్డారాయన. భరించలేని ఒత్తిడి తెచ్చారు. ఆ భూమి అమ్మకానికి అనుమతి ఇవ్వాల్సిందే అని బెదరించాడు. భయపెట్టాడు. వీధి రౌడీ కంటే హీనంగా గోల చేశాడు. ఈ అరాచకాన్ని చూస్తూ సహించలేక తిరుపతి ఎమ్పీ చింతా మోహన్ రంగ ప్రవేశం చేశాడు. చెరువు భూములను వాడుకొనే అధికారం ప్రభుత్వానికి కూడా లేదని సుప్రీంకోర్టు తీర్పు వున్నప్పుడు, ఒక ప్రైవేటు వ్యక్తి ఇంత పెద్ద చెరువును ఎట్లా అమ్ముకొంటాడని గోల్డన్ జూబ్లీ హాలులో జరిగిన ఒక సమావేశంలో కలెక్టర్‌ను నిలదీశాడాయన. మీరు ఈ ఆక్రమణ ఆపకుంటే, నా నియోజకవర్గ పరిధిలోని చెరువులన్నిటినీ నేనే దగ్గరుండి దళితులకు పంచి పెట్తానని హెచ్చరించాడు. చింతా మోహన్ దెబ్బతో రెవెన్యూ అధికారులకు ముచ్చెమటలు పట్టాయి.

కనుపర్తిపాడు చెరువును దర్జాగా ఆక్రమించి లేఅవుట్ వేసిన దృశ్యం.

ఈ భూమి ఆనుపానులు తేల్చుమని తహశీల్దారును ఆదేశించాడు కలెక్టర్ గారు. నెల్లూరు తహశీల్దారు మీద ఆనం సోదరుల ఒత్తిడి ఎంత భీకరంగా వుంటుందో దాన్ని అనుభవించే వారికి తప్ప, చెప్తే అర్థం కాదు. మనిషన్నవాడు ఆ చిత్ర హింస తట్టుకోలేడు. ఆ స్థితిలో తహశీల్దారు ఇచ్చే నివేదిక ఎట్లా వుంటుందో ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు కదా? ఒక చరిత్ర పరిశోధకుడి తరహాలో ఈ భూమి మీద నివేదిక ఇచ్చాడు తహశీల్దారు భక్తవత్సలరెడ్డి. ఎప్పుడో తొంభై ఏళ్ల క్రితం నెల్లూరు జిల్లాలో తీవ్రమైన కరవు వచ్చిందట, తిండి గింజలు లేక జనం అల్లాడి పోయారట. ఆ పరిస్థితిలో బ్రిటీష్ ప్రభుత్వం ఆహార ధాన్యాల ఉత్పత్తి పెంచడానికి చెరువు భూములను కూడా సాగు కోసం పట్టాలుగా పంచి పెట్టిందట. ఆ క్రమంలో ఈ కనుపర్తిపాడు చెరువును సైతం 23 మంది పేదలకు పట్టాలుగా ఇచ్చారని, వారు ఆ భూమిని 1942లో రెండవ ప్రపంచ యుద్ధం సమయంలో రైతులకు అమ్ముకొన్నారని, ఆ తర్వాత దాన్ని పలువురు కొనడం అమ్మడం చేస్తూ వచ్చారని, అందువల్ల దీన్ని ప్రైవేటు భూమిగానే పరిగణించాలని ఒక విచిత్రమైన నివేదిక ఇచ్చాడు తహశీల్దారు.

బాబాయి బండారం బయటపెట్టిన అబ్బాయ్.

పాపం ఆయన్ను తప్పు పట్టి లాభం లేదు. అటువంటి నివేదిక ఇవ్వకుంటే ఎమ్మెల్యేగారి నుంచి ఎటువంటి ఇబ్బందులు ఎదురౌతాయో తెలిసిన సంగతే. ఇదే మాదిరి కలెక్టర్ గారి మీద కూడా విపరీతమైన ఒత్తిడి తెచ్చారు. ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి కూడా రెవెన్యూ అధికారుల మీద తన వంతు పలుకుబడి ప్రయోగించాడు. కానీ ఏ ఒక్క అధికారీ ఆ ఒత్తిడికి లొంగలేదు. ఈ చెరువు భూమిని ఎవరి మీదా రిజిష్టర్ చేయడానికి లేదని రిజిస్ట్రేషన్ శాఖకు ఆదేశాలిచ్చాడు కలెక్టర్. ఎమ్మెల్యే అనుచర బృందం ఆ ఉత్తర్వును సవాలు చేస్తూ హైకోర్టులో కేసు వేసింది కూడా.

కలెక్టర్ నిక్కచ్చి ఉత్తర్వులు

అయితే కలెక్టర్ గారు ఇచ్చిన తుది ఉత్తర్వులు చూస్తే, తన వేలితో తన కన్నే పొడుచుకొన్నారనే సామెత గుర్తుకు వస్తున్నది. ఈ భూమి 1928లో 23 మంది పేదలకు పట్టాలుగా పంచినట్లు కొన్ని తప్పుడు పత్రాలు సృష్టించి, ఆ మేరకు తహశీల్దారు చేత నివేదిక ఇప్పించాడు ఎమ్మెల్యే వివేకా. బ్రిటీష్ కాలం నాటి ఆ పట్టాలలో కొన్ని షరతులున్నాయి. పట్టాలు పొందినవారు ప్రభుత్వ అనుమతి లేకుండా భూములను అమ్మినా, రెండేళ్లపాటు వ్యవసాయం చేయకపోయినా, శిస్తు చెల్లించకపోయినా ఆ పట్టాలను రద్దు చేసి, భూమి ప్రభుత్వ స్వాధీనం చేసే అధికారం ఆర్డీఓకు వుందని, అందుకు భూములు కల్గినవారికి ఎటువంటి నష్ట పరిహారం కూడా చెల్లించవలసిన అవసరం లేదని ఆ పట్టాలలో పేర్కొన్న షరతులు స్పష్టంగా పేర్కొంటున్నాయి. ఎప్పుడో బ్రిటీష్ కాలంలో వాడిన పట్టా కాగితం సంపాదించి, దాని ఆధారంగా ఈ తప్పుడు పత్రం సృష్టించిన భూ ఆక్రమణదారులకు, వారి పత్రం ద్వారానే బుద్ధి చెప్పాడు కలెక్టర్ గారు. ఈ భూమిలో వ్యవసాయం చేసినట్లు ఇన్నేళ్లలో ఎప్పుడూ అడంగళ్‌లో నమోదు కాలేదు కాబట్టి, పట్టా షరతులను ధిక్కరించి భూముల అమ్మకం కొనుగోలు జరిపారు కాబట్టి, పట్టా షరతుల ప్రకారం ఆ భూమి మొత్తాన్ని ప్రభుత్వ స్వాధీనం చేసుకోమని ఆర్డీఓను ఆదేశిస్తూ ఉత్తర్వు చేశాడు కలెక్టర్ గారు. దానితో ఎమ్మెల్యేగారి భూ ఆక్రమణ ప్రయత్నానికి శాశ్వతంగా తెరపడిపోయింది.

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com